శ్రీరస్తు.

శ్రీరాజరాజేశ్వరాయనమః.

232

# ఉమాపత్యభ్యుదయము

అను

# కామినేనివంశచరిత్రము.

225

ఇది

ఆదిపూడి ప్రభాకరకవి విరచితమై

శ్రీ

దోమకొండ సంస్థానాధిప రాజాఉమాపతిరావు మహాబలవంత
బహద్దర్ దేశాయివారి
యాజ్ఞానుసారము



కాకినాడ:

శ్రీ సుజనరంజనీముద్రాక్షరశాలయందచ్చుకూర్పఁబడి

గ్రంథకర్తగారిచే ప్రకటించఁబడియెను.

1909



Raja, Omapath Rao, Mahabalwanth, Bahadur,
Samasthan, Domakonda.

# శ్రీకామినేని వంశవృక్షము.

(1) కామినేని చాదరి

(2) కాచా రెడ్డి

(3) భోగి రెడ్డి

(4) కాచా రెడ్డి    మల్లా రెడ్డి    బొమ్మా రెడ్డి

(5) ఎల్లా రెడ్డి

కన్నా రెడ్డి    (6) కాచా రెడ్డి    పర్వత రెడ్డి

జంగమ రెడ్డి    కామి రెడ్డి    (7) యల్లా రెడ్డి    మల్లా రెడ్డి

కాచా రెడ్డి    సదాశివ రెడ్డి    లింగా రెడ్డి

రామా రెడ్డి    చంద్రా రెడ్డి    ఎల్లా రెడ్డి

విస్సా రెడ్డి    ముత్యం రెడ్డి    (8) చినకామి రెడ్డి

(9) శోభా రెడ్డి    కంఠా రెడ్డి    ఎల్లా రెడ్డి

# PREFACE

THIS little book deals with the history of the Kamineni amily and is written in Telugu verse by the author Adipudi Prabhakararau under instructions from Sree Raja Umapathi Rau Bahadur, the enlightened and cultured descendant of hat cultured and well known family. Books of this kind are ery rarely met with in Telugu Literature and great credit is due to the author for the lucid style and simple rhetoric in which it has been written. This family history biographical nd descriptive as it is, besides being interesting to readers f Telugu poetry may very well be said to be a contribution to he history of the Telugu country which has been the cradle f many important and note-worthy families of historical and iographical interest but whose character is being almost for-otten by the present generation.

The book opens with a short interesting sketch of the icissitudes of Deccan and the history of the Mohammadan ynasty of Hyderabad. The founder of this family is Ka-inedu after whose name the family is known. His son Ka-hareddi was granted a sannad by Nawab Sultan Mahammad f the Estate of Domakonda. The members of this family herefore belong to the ancient family of Reddies who were : one time most important and powerful in Deccan and he Telingana Country. Among the members of this il-strious family Kachareddi was celebrated for his valour, allareddi for his great literary attainments and authorship the celebrated Padmapuranum and many works and his rong devotion to Rama, Rajeswara Row for his godliness nd warriorship, Rameswararow for his great physical rength and his brother Someswararow for his charity. This mily has been thus from time to time embellished with such lustrious personages whose biography is a pleasure to read

and whose descendant the present Rajah may very well feel proud of belonging to. Rajah Someswararau curried very high favour with the late Sir Salarjung Bahadur, and rendered good service to The Nizam of Hyderabad. Rajah Ramachendrarow at whose instance and advice the author has written this book is the grand-son of Rajah Someswararow, and the son of Umapathirow Bahadur, the present ruling Rajah of the family Estate of Domakonda.

COCANADA }
3-5-09. }

K. R. V. KRISHNA ROW, B. A.,

*Zamindar of Polavaram.*

# పీఠిక.

ఉమాపత్యభ్యుదయమను నామాంతరముగల యీకామినేని వంశచరిత్రమును రచియించినకవి ఆదిపూడి ప్రభాకరామాత్యుఁడు తండ్రి బుచ్చివేంకయామాత్యుడు తల్లి రామలక్ష్మమాంబ తాతతండ్రుల నివాసము ప్రస్తుతము గుంటూరుమండలమందున్న ఆదిపూడి యనుగ్రామము. ఈకవిజన్మభూమి బెంగుళూరు. ఈకవిపుంగవుండు చిరకాలము గద్వాలసంస్థానమునం దాస్థానకవిగానుండె. ఒక గద్వాలయే కాదు నైజాము మండలములో నీకవి నెఱుఁగని సంస్థానమె లేదు. తదాస్థానాధిపతియగు రామభూపాలునకుఁగాని తద్బంధుమిత్రాది పరివారమునకుఁగాని యిక్కవియందలి మహాభిమానమును మేము స్వయముగఁజూచి యెఱుంగుదుము. ఇక్కవి పెద్దన్నయుఁ జిన్నన్నయుఁ దమ్ముండును మిగుల పేరుచెందిన మహాకవులు. నిజముగా వీరిది కవివంశమని నుడువుటకేమియు సందియంబుండదు. ఈగ్రంథము కామినేనివారను గృహనామముగల దోమకొండ సంస్థానప్రభువుల యద్భుతౌదార్యవీర్య సాహసాదిగుణములు తెలుపును. ఈదోమకొండ సంస్థానము నైజాము రాజ్యములోని యొకశాఖ. ఈగ్రంథమందుఁ జక్కని ప్రస్తావన కల్పించి యీభరతఖండముయొక్క యభ్యుదయాదికమును దీని పరిపాలించిన రాజులయు నిందున్నకవులయుఁ జరిత్రంబును బ్రిస్తుతప్రభువులగు నాంగ్లేయులవలన దీనికిఁగలిగిన యభ్యుచ్ఛ్రయంబును మొట్టమొదట స్థాలీపులాకన్యాయముగా వర్ణింపఁబడినది. పిదప దోమకొండ సంస్థానప్రభువంశపరంపరయు నాతికఠినంబులై రసవంతములై యనతిశయోక్తిగుంభితంబులై స్వభావోక్తి సుందరంబులై ముద్దులు మూటలు గట్టుచక్కని మృదుపదములచేనలంకృతంబులగువర్ణనాంశంబులచేజెవుల

కుజవులుపుట్టించునట్లువర్ణింపఁబడినది. ఈకవికవితాకన్యక నాగరకసతీతి లకమువలెసహజాలంకారములచేఁగ్రాసేయఁబడిన సద్గుణవతిగాని యెట్టు వునగలైనను దాల్చిలేనిపోని సింగారమునుఁడక్కుటెక్కులునుజూపించు వారకాంతవంటిదిగాదు. ఇంగ్లీషు కన్నడము హిందుస్థానీ తెలుఁగు ఈ నాలుగుభాషలయందును దగినపాండిత్యముగలిగి చాతుర్యమూలంబుల గు సర్వలక్షణంబులతో దేశమర్యాదలన్నియు నెఱింగినకవి తెలుగు కవిత్వంబునకేమి కొఱంతకలుగును.

శ్లో. శక్తిర్నిపుణతాలోక శాస్త్రకావ్యాద్యవేక్షణాత్
కావ్యజ్ఞశిక్షయాభ్యాస ఇతిహేతుస్తదుద్భవే.

సహజంబగు పూర్వజన్మసంస్కారము మొదటిది తరువాత దేశావేక్షణము శాస్త్రావేక్షణము కావ్యావేక్షణము పిదప కావ్యకర్తల యొద్ద కవితారచనాపాటవాభ్యాసము. ఇవియున్న కవి కవిత్వంబున కేమిలోటు. పదలక్షణమెఱుంగక యౌచిత్యము సర్వపూజ్యమై యతి ప్రాసములుమాత్రముగూర్చి కవులమనిపించుకొనుచు వెఱ్ఱిమొఱ్ఱి ప ద్యంబులువ్రాసిన పుస్తకములు వెల్లివిరిసిన యీపాడుకాలంబునఁ క విత్వపు మంచిచెడ్డలు విచారించుటయె యొకకానిపనికాని యెక్కడ నో నూటికి పదిమందిచొప్పునఁ బూర్వకవులతో సాటియగుకవులుమా త్రము లేకపోలేదు.ఆపదిమందిలో నీకవియు నొక్కఁడు. కవి నవీను డని మాత్రము నుడువక యీగ్రంథంబును బూర్వకవి ప్రణీతమెయ నచో నందులకు సందియంపడువారెవ్వరు నుండరు. ఈకవి రచించిన కందరామాయణము తిలకించినచో నితనికభినవ తిక్కన యనుబిరు మెవ్వరొసంగరు. పూర్వజన్మపుణ్యవిశేషంబునం జక్కనికూఁతు రుద యింపవలెఁగాని జక్కనిదానిం గనవలయునన్ని కుతూహలపడి యెవ్వ కనఁగలరు. అట్లుదయించినను దానికి దే[illegible]కాలములకు నుచితంబుల,,

నడవడులు కలిపి యుచితంబులగు నలంకారములు కైసేసిన మెత్తురు గాని యన్యథా మెచ్చరు. అటులున్నను దానికి వ్యభిచారము చౌర్యము మొదలగు గుణములుదయించిన నున్నదంతయు హాస్యాస్పదము కాకపోదు. కావున గృహస్థునకు నిర్దుష్టయు సర్వగుణభూషితురాలు న గు కూతురుండుట యెంతటియదృష్టమో కవి కవితయు తాదృశయగుట యంతటియదృష్టము. కర్ణరసాయనముసేయు నొకపద్యమునకున్న విలువ పొల్లుపద్యముల వేయింటికయిన నుండదు. ప్రతిపద్యంబునందును గ్రొత్తయెత్తుబడి పదముల పొందిక రసానుగుణౌచిత్యము భంగ్యంతరకథన నైపుణ్యము వర్ణనాచమత్కారము వ్యంగ్యవైశద్యము మొదలగు కవితకుఁ గావలసిన పరికరమంతయు నీయమాత్యకవికిఁబూర్వపుణ్యవిశేషంబున నలవడినది. ఈచిన్నిపొత్తంబునఁ దత్తద్గుణపూరితంబులగు పద్యంబుల నిందు వేఱ కనపఱచుట యనావశ్యకమని యాభారము చదువరులకే వదలినాము.

సీ. చంద్రుఁడెవ్వరికైనఁ జల్లఁగానుండడా పద్మాలభాగ్యమాపాటిగాక

యన్నట్లసూయచేసంతసింపనివారిపాపకర్మమునకు మేముత్తరవాదులముకాము. కాని సర్వవిధములనిక్కవి కవితాకన్య ధన్యయనుటకు మేము వెనుదీయము. కవిదీర్ఘాయుష్మంతుడైసజ్జనకర్ణరసాయనము సేయు నిట్టియుత్తమప్రబంధములు రచించుచు దెల్గునాటి నియోగులకుంగల కవితాప్రాభవము వెల్లడిసేయుగాతయని భగవంతునింబ్రార్థించుచు నింతటితో విరమించెదము.

30-5-09,<br>
కాకినాడ.

ఇట్లు,<br>
శతావధానులు,<br>
తిరుపతి వెంకటేశ్వరులు.



శ్రీ ర స్తు,

శ్రీ రా మ చ ం ద్రా య న మః.

ఉమాపత్యభ్యుదయమను,

# కామినేనివంశచరిత్రము.



శుభ్రాంశుకళావిభూషిత జటో ♦ ష్ణీషంబు గంగాభవా
నీశుద్ధాంతము సేసి హైమవతినిం ♦ దేహార్ధమందుంచిభృం
గీశాదుల్ గొలువంగఁ గొల్వయిప్రజా ♦ భీష్టంబులం గూర్చు
గా! రీశుం డాదట మాయుమాపతి ధరా ♦ ధీశుంగృ
పం బ్రోవుతన్.

చ. ఒకవనసూకరంబుకొఱ ♦ కుద్ధవిడిం జగడించి రాజబా
లకు నలయించు టేకరుణ ♦ లాఁ గిఁకఁ జాలును లెం డటంచు భ
ర్తకు దయ పుట్టఁ బల్కు బలి ♦ తం బగు పాశుపతంబు సవ్యసా
చికి నొడఁగూర్చు శాంభవి ప్ర ♦ సిద్ధగుణుం గృతిభర్తఁ నేలుతన్.

ఉ. పాలసముద్రమందు వలి ♦ పంపువటచ్ఛదశయ్య నాదిమ
వ్యాళఫణోపధానసము ♦ దంచితుఁడై నిదురించు చుండి లో
కాళి భరించు కార్య మెద ♦ హత్తిన మేల్కని లచ్చిచెక్కుట
ద్దాల మొగంబుఁ జూచుకొను ♦ దైవముమాకృతిభర్తఁ బ్రోచుతన్.

చ. ఇరుగడలన్ సితోత్తమము ♦ దేభయుగంబు విశుద్ధవాఃప్రపూ
ర్ణరుచిరకుంభసంయుతక ♦ రంబులతోఁ గర మొప్పఁగా జగ
ద్భరణధురీణ యై యమర ♦ భామలు గొల్వఁగఁ బద్మపీఠి సు
స్థిరత నెసంగులక్ష్మి దయ ♦ సేయుత మాకృతినాథుకోర్కులన్. 4

చ. అమలమనస్సరోవరవి ♦ హారపరాయణరాజహంసర
త్నము సతి తాను నెక్కి ఘను ♦ నాల్గుజగంబుల నాత్మసృష్టిచి
త్రములనుచూచుచుం గడుము ♦ దం బెసఁగ న్విహరించుశారదా
రమణుఁడు మాకృతీశునిఁ జి ♦ రాయురనామయుఁ జేసి ప్రోవుతన్.

సీ. పున్నమజాబిల్లిఁ ♦ బురణించుమోమునఁ
జిరునగ వల్లలఁ ♦ జివురు లొత్తఁ
దేఁటిమొత్తముల నం ♦ దించునల్లనినును
తురుమునఁ దోవమొగ్గ ♦ విరియు చుండఁ
గనికరంబులకుఁ డి ♦ కాణ మై యొప్పారు
నిండుకన్గవఁ గనీ ♦ నికలు కదల
నానందమున నుబ్బు ♦ సందంపుఁజనుదోయి
నలరారు హీరా లా ♦ స్యంబు సేయఁ

తే. జేఁ జిలుక పాడ రాయంచ ♦ చిందు లాడ
నలువ ము ద్దాడ నెచ్చెలు ♦ లెలమిఁ జూడ
సొలపు గుమి గూడ గానంబు ♦ నలుపు ప్రోడ
మాకృతీశు మనుచుత బ్రో ♦ మంబుతోడ. 6

చ. కవి యన నిట్టు లుండఁ దగుఁ ♦ గావ్యము నా నిటు లుండనోపు న
త్కవితకుమార్గ మియ్య దిది ♦ గ్రంథములన్ రచియించుత్రోవయి
య్యవి తగులక్ష్యలక్షణము ♦ లం చెఱిఁగించిన పుణ్యవంశ స
ద్భవులను సంస్కృతాంధ్రకవి ♦ తారచనాఢ్యుల సంస్మరించెదన్.

చ. కవి యన నొల్ల రేని మఱి ♦ కావ్యముల న్వినఁ నొల్ల రేని స
త్కవితను గారవించుటయుఁ ♦ గా దని పల్కుదు రేనిఁ గైసరుల్
చెవులకు ముల్కు లేనిఁ దమ ♦ చిత్తము గాని మహాత్ములార నా
కవితను నన్ను నెంచ కను ♦ కంపమెయిం దగ నాదరింపుఁడీ. 8

వ. అని యిట్లు సర్వప్రపంచకారణభూతులగు నాదిమదంపతులం గృతి
పతికి శ్రేయఃప్రసాదోన్ముఖులం జేసి కవితాప్రపంచంబునకుమహో
పకారు లగు నగణ్యపుణ్యమూర్తులమహాకార్యంబు లుగ్గడించి కవి
ధురావహులదృష్టిదోషంబు కృతి కంట కుండఁ గాపు సేసి మదీయ
కవితాలహరిం బ్రవహింపఁజేయందగు తెఱఁగాలోచింపుచున్నంత.

శా. హిందూదేశపు ముఖ్యరాష్ట్రములలో ♦ నెం తేనిఁ బేర్వాసిచే
సందీపించు నిజాముురాజ్యమునకున్ ♦ సామంతసంస్థాన మ
స్పందశ్రీకము దోమకొండ యనఁ గా ♦ భాసిల్లు రాజ్యంబు దా
నిం దా నేలు నుమాపతిప్రభుఁడు కా ♦ మ్నన్యన్వయుం డాదృతిన్.

ఉ. ఆనరనాథచంద్రుఁడు మ ♦ హావిభవం బెసలార నున్నతా
స్థానమునందుఁ గొల్వయి ప్రి ♦ సన్నమనంబున నన్నుఁ గాంచి స
న్మాన మెలర్ప భ్రాతృసుత ♦ మంత్రిపురోహితమిత్రవర్గ మెం
తే నుతియింప ని ట్లనె ప ♦ యిద్ధసుధామయవాక్యధోరణిన్.

మ. మును గద్వాలనృపాలశేఖరుఁడు మి ♦ మ్మున్ మాకుఁ జూపించిమీ
యనఘం బైనకవిత్వసంపద మహీ ♦ యఃప్రీతిఁ గొండాడఁ గా
విని మీచే నొకసత్కృతిం బడసి పృ ♦ థ్విం గీర్తిఁ బొందంగమా
మనమం దువ్విళులూరు చుంటి మది సం ♦ ప్రాప్తించె నీనాటికిన్. 12

మ. విని యున్నారుమదన్వవాయమునుఁ ద ♦ ద్విఖ్యాతియుందానియం
దున జన్మించిన సుప్రసిద్ధపురుష ♦ స్తోమంబును న్నా రొన

ర్చినకార్యంబులుఁ దత్కథల్ వినుటకుం ♦ జిత్రంబు లౌఁ గానవా
నినిఁ గావ్యంబుగఁ గూర్చిమీరుమముమ ♦ న్నింపందగుం బ్రీతితోన్

ఉ. ఔ నని సత్కవిప్రతతి ♦ యాదల లూపఁగఁ గ్రొత్తచిన్నిపూఁ
దేనియచాలు చాలుకొనఁ ♦ దీయనిమేల్నుడికార మొప్పఁచున్
మీనయగారవుం గవిత ♦ మించెడుఁ గాన మదీయవంశోమ
ద్దాన నలంకరించి మము ♦ ధన్యులఁ జేయుట మీకు నొప్ప దే.

చ. సరసకవిత్వవైభవవి ♦ శారదులై నుతి కెక్కినట్టి యా
తిరుపతివేంకటేశ్వరుల ♦ దీనికి ము న్నియమింప వారు నున్
మరిమరి చెప్పి రిందులకు ♦ మాకు ను మీకు ను మిత్రుఁ డౌ ప్రభా
కరకవి యే సమర్థుఁ డని ♦ కావున మీ కిది తప్ప దెప్పుడున్. 15

మ. అని న న్నాదర మొప్పఁ గా సవినయుం ♦ డై పల్కె రేపిళ్ళగో
త్రుని విఖ్యాతచరిత్రుఁ గామసమగా ♦ త్రున్ సోమభూపాలపు
త్రు నుమాపత్యభిధానరాడసమనే ♦ త్రున్ లచ్చమాంబాకళ
త్రుని సద్వంశపవిత్రుఁ గాంచి మది సం ♦ తోషంబుమల్లాడఁగాన్.

ఉ. భూపకులావతంసమ య ♦ పూర్వదయాంసలబుద్ధితోడ మీ
రీపగిది న్ననుం బలుకు ♦ టెంత యుఁ బ్రేమముపొంటె సుండు మే
ధాపరిణాహమందు నను ♦ దాఁటుదు రెందఱో వారి మాని న
న్నీపని సేయు మంట కృత ♦ కృత్యునిఁ గా ననుఁ జేయుటే కదా.

సీ. కరుణాకటాక్షవీ ♦ క్షాప్రాపితాశ్రితే
ప్సితుఁడు సోమేశ్వర ♦ క్షితిధవుండు
సతతధర్మైకని ♦ ష్ఠాగరిష్ఠహృదంత
రాళుం డుమాపతి ♦ రాయమహాళి
అతులకీర్తిప్రీణి ♦ తాఖిలాదిత్యస
మూహుఁ డన్నారెడ్డి ♦ భూవరుండు

ప్రాలేయశైలాత్మ ♦ జాలోలవరపదా
బ్జాతభక్తుండు రా ♦ జన్ననృపతి
* తే. తండ్రి యును దండ్రితండ్రి యుఁ ♦ దండ్రితాత
తాతతాత యు నుం గాఁగఁ ♦ దనరు నీదు
ధన్యతమ మైన వంశావ ♦ తరణమహిమ
సుకవి వర్ణింప జన్మ తా ♦ రకముగా దె. 18

సీ. పార్వతీనాథన ♦ త్పదపంకజోపాస
నం బన్నఁ బెన్నిధా ♦ నంబు మీకు
దేవభూదేవప్రి ♦ సేవాచరణమన్నఁ
బండువపైని ప ♦ బ్బములు మీకు
నాశ్రితసుజనలో ♦ కార్తిఁ బాపుటయన్న
నమరిననిత్యకృ ♦ త్యములు మీకు
నహితరాజన్యగ ♦ ర్వాతిరేకము మాన్పు
పని యన్నఁ జేకొన్న ♦ వ్రతము మీకుఁ
తే. దాతతండ్రులనాఁటిస ♦ త్పథముఁ బట్టి
నడుచు టది యిష్ట మైనట్టి ♦ నడత మీకు
నట్లు నుతి కెక్కినట్టి మీ ♦ యన్వయంబు
సుకవి వర్ణింప జన్మ తా ♦ రకము గాదె. 19

సీ. ప్రతి లేని నీపరా ♦ క్రమమున కానబా
బున కీ వ్రేసంగిన ♦ పులులుసాక్షి
జత లేని నీమహై ♦ శ్వర్యంబునకు నీవు
తూఁగిన బంగారు ♦ తులలుసాక్షి

---

* కృతినాథుఁ డగు శ్రీ రాజా ఉమాపతిరావు బహద్దరు జమీదారుగారి జననము 1266 హిజిరీ 1306 రాచరికము ప్రారంభము.
591 / 1857   591 / 1897

మొన లేని నీజగ ♦ దీశ్వరభక్తికి
సత మీవు సల్పును ♦ త్సవము సాక్షి
సామ్యంబు లేని నీ ♦ జనకభక్తికి నీవు
ప్రేరేచినట్టి యీ ♦ కృతి యె సాక్షి
గీ. పురుడు లేనట్టి నీతపశ్ ♦ పుణ్యమునకు
వితతసన్మార్గు లైన నీ ♦ సుతులు సాక్షు
లట్టి నుతికెక్కినట్టి నీ ♦ యన్వయంబు
సుకవి వర్ణింప జన్మతా ♦ రకము గాదె. 20
సీ. జానపదులచేత ♦ సాధము ల్గట్టించి
శిల్పశాస్త్రంబును ♦ నిల్పినాఁడ
* వరదము ల్గట్టించి ♦ హరిహరోత్సవములు
ప్రత్యబ్ద మభివృద్ధి ♦ పఱచినావు
హయరత్నలక్షణ ♦ వ్యాసంగమున మంచి
పేర్వాసి కెక్కి దీ ♦ పించినావు
§ నవ్యవిక్రముఁడవై ♦ నైజాముచే మహా
బలవంతబిరుదంబు ♦ వడసినాఁడ
గీ. వింధ్యాచక్రవర్తిని ♦ తుండు చూడ
వచ్చినప్పుడు పులులను ♦ బట్టితెచ్చి
పసదనం బిచ్చి మెప్పులు ♦ వడసినావు
కీర్తిసాంద్ర యుమాపతి ♦ క్షితితలేంద్ర. 21

---

* 1324 సం॥ లో రథనిర్మాణము.

§ హిజిరి 1316 సం॥లో నవాబుగారి జన్మోత్సవమునాడు మహాబలవంత బిరుద మియ్యఁబడెను.

చ. అతికుశలత్వ మొప్ప మృగ ♦ యావిహ్వాతిం జెలరేఁగి వీరు ల
దృతపడుచుండ బెబ్బులులు ♦ ముప్పదికెక్కుడు గొట్టి లోకవి
శ్రుత మగుపేరు గంటి వతి ♦ శూరుఁడ వశ్వపరీక్షయందు నీ
చతురతకున్ సమాన మె యె ♦ సంగదు రాజ యుమాపతీశ్వరా.

చ. వినయము నుత్తమాగ్రజన ♦ హస్రములఁ ఘృతపూపభక్ష్యభో
జనములఁ దృప్తిఁ జేయుదు వ ♦ జస్రము శ్రీభగవంతుచింతనం
బెనయుదు గానలోలమతి ♦ వెందు ను నీచెవిచెంత దైవకీ
ర్తనములు గాయకు ల్బహువి ♦ ధాలనొనర్పక కూర్కు వెప్పుడున్.

చ. హరిహరదేవసద్మముల ♦ నంతములేని మహోత్సవంబు లే
ర్పఱచి రథోత్సవంబులకొ ♦ అంత యుఁ దీరఁ గఁ దేరు లంబరం
బొరసెడు కేతనంబులన ♦ మూహముతో వెలయించి తండ్రికి
న్నెరపితి వాత్మజన్మకర ♦ ణీయసమస్తమహోపకారముల్. 24

సీ. పరిజలసంకటము లో ♦ ప్పరికింప కవ్వాని
నురవృమై పాపు మ ♦ హాహాద్యమములు
నతివృష్ట్యనావృష్టు ♦ లార్తిఁ జేయకయుండ
సస్యముల్ కాపాడు ♦ సాధనములు
తల మీఱునట్టి ప ♦ న్నులు లేక కాపులఁ
బాలించునట్టి యు ♦ పాయములును
నవని నెల్లరను వి ♦ ద్యావంతులు గఁ జేసి
యజ్ఞాన మడఁచు ప ♦ రి యత్నములును
నహరహముఁ జేసి సర్వాంస ♦ హాధిపత్య
భారము వహించి యిట్టి భూ ♦ పాలుఁ డెందుఁ
గలఁ డనెడుశంక వర్ధిల్ల ♦ వెలసి తౌర
కీర్తిసాంద్ర యుమాపతి.♦ క్షితితలేంద్ర. 25

సీ. తల మీఁఋనట్టి వ్య ♦ ర్థపువెచ్చములు సేసి
ఋణపడినట్టి భూ ♦ మీశు లెల్ల
పూర్వమ తాచార ♦ ము లె కూడ వని ప్రజా
వైషమ్య మొందిన ♦ ప్రభువు లెల్లఁ
బన్నులఁ బెంచి యా ♦ పన్నులఁ గాపుల
రక్తంబు పీల్చెడు ♦ రాజు లెల్ల
సర్కారువారిప ♦ క్షము వారినిఁ దృణీక
రించి పెంపఱిన పా ♦ ర్థివుల నెల్ల
గీ. నిన్ను నీరాచరికమును ♦ నీయశంబుఁ
గాంచి మతి గాంచి కడు మేలు ♦ కాంచునట్లు
ధరణి నేలితి నిస్తంద్ర ♦ తావిశిష్ట
కీర్తిసాంద్ర యుమాపతి క్షితితలేంద్ర. 26

సీ. బొబ్బ వెట్టినఁ జాలు ♦ భూలోక మెల్లను
నడలఁ గొట్టెడు పెద్ద ♦ వ్యాఘ్రములను
నెగిరినఁ జాలు నీ ♦ రేడులోకములు హా
టాహుటిం జుట్టు ఘో ♦ ట్టాణములను
దెఱచినఁ జాలు దీ ♦ ధితులచే దిక్కులు
పటవణించెడు రత్న ♦ పటలములను
గూరుచుండినఁ జాలుఁ ♦ గుదు పింత యును లేక
యతిసౌఖ్య మొసఁగు శ ♦ తాంగములను
గీ. హైదరాబాదుబాదుషా ♦ యయి ప్రసిద్ధిఁ
గన్న మీర్మహబూబలీ ♦ ఖానుబహదు
రునకుఁ బసదన మొసఁగి ని ♦ రుపమకీర్తిఁ
గాంచితివి భువి నింతియె ♦ కాక మఱియు. 27

గీ. లార్డుమింటోప్రభుం డెడ్డు ♦ వర్డుసార్వ
భౌమునకుఁ బ్రతినిధి గ ని ♦ జామురాజ
ధాని కేతెంచినప్పు డా ♦ హ్వాన మొసఁగి
నిన్ను మన్నించె దోడిమ ♦ న్నీలు పొగడ. 28

గీ. అన్న మోరామచంద్ర యం ♦ చాకలి గొని
వేనవేల్ ప్రజ కరువులో ♦ వేధపడఁ గఁ
జీరి యన్నం బొసంగి ప్రో ♦ చితివి వారి
నెల్ల నీసాటినెరదాత ♦ లెవరు గలరు. 29

గీ. పండ్లు పూండ్లు గ నార్జించి ♦ యిడిన ధనము
*తోడ వే తులాభారంబు ♦ తూఁగి యట్టి
ధనము నెల్లను బ్రాహ్మణ ♦ తతికి ధారఁ
బోసి యిహపరసాధన ♦ ములను గంటి. 30

గీ. ధరణిసురకోటి వివిధసం ♦ తర్పణములఁ
దన్పి లోకైకవిఖ్యాతిఁ ♦ దనరినావు
కృతయుగపుచర్యతోడ వ ♦ ర్తించినావు
కీర్తిసాంద్ర యుమాపతి ♦ క్షితితలేంద్ర. 31

సీ. తల్లిదండ్రులకు నెం ♦ తయు ననుంగుంగూఁతు
రత్తమామలకను ♦ వైన కోడ
లప్పసెల్లెండ్రక ♦ ల్లారుముద్దులతోఁడు
నేరాండ్రకింపైన ♦ యీఁడుజోడు
వదినెలకెల్ల న ♦ బ్రంబైన మఱదలు
మఱదండ్రకెల్ల బ్రే ♦ మంపు వదినె

---

* హిజరీ 1333 తులాభారము.

బావమఱఁదులకు ♦ భయభక్తి గలచాన
యాత్మజులకు గార ♦ మైన తల్లి

గీ. పతికిఁ బ్రాణసమాన యా ♦ భార్య బంధు
వర్గమున కెల్ల నెయ్యంబు ♦ వరలు చుట్ట
మనఁ గ నుతిఁ గాంచె నీకు న ♦ ర్ధాంగలక్ష్మి
యాశ్రితులకల్పవల్లి ల ♦ చ్చవ్వతల్లి. 32

సీ. అశ్వశిక్షణమున ♦ నతికుశలుండు వి
ద్యామూర్తి బహువిధే ♦ యస్వభావుఁ
డఖిలపుణ్యక్షేత్ర ♦ యాత్రాచరణపవి
త్రుఁడు మహాశూరుండు ♦ రుద్రప్రతాప
మూర్తి తేజోనిధి ♦ కీర్తిమంతుఁడు సుగు
ణములకు విడిది స ♦ న్మార్గవర్తి
దేవభూసురభక్తి ♦ చే వరలెడువాఁడు
విబుధసన్నుతుఁడు వి ♦ వేకశాలి

గీ. బంధుగులయందు మిత్రుల ♦ యందు మిగుల
దయ గలిగి యొప్పువాఁడు స ♦ త్యనిరతుండు
వితరణఖని యన్నారెడ్డి ♦ విభుఁ డనంగ
నీమొదటితమ్ముఁ డతని వ ♦ ర్ణింపఁ దర మె. 33

గీ. పుట్టినింటికి మఱి యును ♦ మెట్టినింటి
కలవరచె వాసి వన్నెయు ♦ నతని సాధ్వి
యతిసదాచారసంపన్న ♦ యఖిలధరణి
సజ్జనుల కాకులో బువ్వ ♦ జానకవ్వ 34

సీ. తల్లిదండ్రులయెడఁ ♦ దనయులు తనయుల
యెడఁ దల్లిదండ్రు లి ♦ ట్లెనఁగ వల్లయు

గురువులయెడ శిష్య ♦ కోటి శిష్యులయెడ
గురువులు నీరీతి ♦ నెరయవలయుఁ
బెనిమిటులయెడఁ ♦ బెండ్లాలు పెండ్లాల
యెడఁ బెనిమిటు లిట్టు ♦ లెసఁగవలయు
రాజులయెడఁ బ్రజ ♦ ప్రజయెడ రాజులు
నిప్పగిదిని లెస్స ♦ నెప్ప వలయు
గీ. ననునటులు లోకమునకు ల ♦ క్ష్య మయి యొప్పు
నడవడి పొసంగ నుతి కెక్కెఁ ♦ బుడమిలోన
ధన్యతమమూర్తి నీచిన్న ♦ తమ్ముఁ డైన
రాజరాజేశ్వరాఖ్యధ ♦ రావరుండు. 35

*సీ. అసమాన మగుమహా ♦ జనవంతబిరుదంబు
ప్రభు వైననైజాము ♦ వలనఁ బడసి
సేతువారాణసీ ♦ క్షేత్రాదులను గొల్చి
యతిధర్మశీల రం ♦ గవ్వయందు
లలితమూర్తులఁ బుత్రి ♦ కల నల్వురను నొక
సుగుణసంపన్నుని ♦ సుతునిఁగాంచి
యందు రెండవపుత్రి ♦ యైన శ్రీసౌభాగ్య
వతిసంగవాఖ్యకు ♦ వలయనేత్రి
గీ. నాత్మకూరజూరచింతసిం ♦ హాసనాధి
పతికి శ్రీరామభూపాల ♦ వరున కొసఁగి
పెండిలియొనర్చి రాజేశ్వ ♦ రుండు మిగులఁ
బావనములొనరిచె రెండు ♦ వంశములను. 36

---

* హిజరీ 1316 సంIIలోన బిరుదమియ్యఁబడెను.

1907

గీ. ఆంధ్రహూణాంగిలేయభా ♦ షాభ్యసనము
నందు మిగులఁబరిశ్రమ ♦ మందు చున్న
వాఁ డతనిపుత్రరత్నంబు ♦ బాలుఁ డయ్యు
నతికుశలబుద్ధి రామేశ్వ ♦ రాహ్వయుండు. 37

క. నీయనుఁగుచెల్లె లుమ్మ్రవ
శ్రీయుతు ధర్మాత్ము శుభ ♦ చరితు వితరణ రా
ధేయు వరియించె దేవ
ప్రియుఁ గద్వాలరామ ♦ పార్థివతిలకున్. 38

చ. ధవళయశోభిరాముఁడు స ♦ దాశివరాయఁడు రాఘవేంద్రభూ
ధవతనయుండు నీకుఁ బిన ♦ తండ్రికుమారుఁ డనూనధర్మశా
స్త్రవిహితవర్తనుం డనుఁగు ♦ దమ్ములకంటెను బ్రీతి గూర్చువాఁ
డు వితతదానధర్మపరు ♦ డుం గులదీపకుఁ డాతఁ డెంతయున్. 39

చ. ఇతరమహీపతు ల్దన య ♦ దృష్టమునుం గొనియాడు చుండ నా
*యత "రణధీరవంత" బిరు ♦ దాంకము నైజముచేత నందివి
శ్రుతహయశాస్త్రకౌశలని ♦ రూఢి వహించి మహాస్త్రవిద్యయం
దతఁడు ప్రసిద్ధి కెక్కె మృగ ♦ యావిహృతిం గడు నేరు పేర్పడన్

గీ. అవ్వసుమతీశుభార్య వెం ♦ కవ్వ సాధ్వి
యఖిలసద్గుణజాల ద ♦ యావిశాల
ధర్మకార్యాతిలోల వి ♦ తరణశీల
యొసఁగుఁ బత్యనుకూల బా ♦ లేందుఫాల.

సీ. విద్య యుండెడిచోట ♦ వినయ ముండ దటంచుఁ
బెద్దలు వచియించు ♦ సుద్దు లెల్ల

---

* హిజరీ 1316 సంIIలో నీబిరుద మీయఁబడెను.

197

దర్వ్య ముండెడిచో వి ♦ తరణ ముండ దటంచుఁ
బండితు ల్పలికెదు ♦ పల్కు లెల్ల
నాకృతి గలచో గు ♦ ణాళి యుండ దటంచుఁ
జదువరు ల్సెప్పు శా ♦ స్త్రంబు లెల్ల
ప్రభుత యుండెడిచో స ♦ రసత యుండ దటంచుఁ
బ్రాజ్ఞులు నుడివెడు ♦ బాస లెల్ల
గీ. దబ్బరలు సేసి సృష్టిక ♦ ర్తకు నెసంగు
నగడు పోఁగొట్టఁ గలిగె నీ ♦ యగ్రసుతుఁడు
రాజరాజేశ్వరుండు వి ♦ రాజమాన
సర్వసుగుణాన్వితుండు వి ♦ స్తారయశుఁడు. 42
ఉ. పారసిబాసయందునఁ బ్ర ♦ బంధముల న్రచియించినాఁడు సొం
పారఁ గ హూణభాష మఱి ♦ యాంధ్రమునం గడిదేఱినాఁడు వి
స్తారదయాసమగ్రుఁ డతి ♦ శాంతుఁ డదంభుఁడు దేవభూమిబ్రం
దారకభక్తుఁ డాతని క ♦ తం డె సదృశ్యుఁడు పెక్కుభంగులన్. 43
ఉ. ఉవ్వన నత్తమామలను ♦ నోమెదుకౌశలము న్నిజేశునిన్
మవ్వపుఁబ్రేమతోఁ గొలుచు ♦ నాడెము దేవునిభక్తిమోద మున్
నివ్వటిలన్ మదిం గొలుచు ♦ నేరుపు నీపెదకోడలైనరా
జవ్వనుఁ జూచి నేర్పఁ దగు ♦ శారదకు న్సిరికిన్ భవానికిన్. 44
గీ. ఆమె కడుపారఁ గాంచిన ♦ సీమనుమలు
రమణ సోమేశ్వరుండు ను ♦ రాఘవేంద్రుఁ
డెనసి నీతండ్రిపినతండ్రు ♦ లను సమస్త
విధములను మఱపించుచు ♦ వెలసిరిపుడు. 45
సీ. ఇటు పుట్టుసూర్యుఁ డిం ♦ కెటు పుట్టె నేనియు
నన్నృతంబు పల్కునఁ ♦ జొనుప డనిన

ధరణి యూకాశంబు ♦ తలకిందు లైనను
జేయి సాచిన వెన్క ♦ దీయఁ డనిన
నేడు సముద్రమ్ము ♦ లేక మై పొంగిన
నెదుటించు నరికి వె ♦ న్నీయఁ డనినఁ
బగట నే చుక్కలు ♦ ప్రభవించె నేని యుఁ
దల్లితండ్రులమాట ♦ దాఁటఁ డనిన
గీ. నీద్వితీయసుతుం డయి ♦ నెగడు రామ
చంద్రభూపాలునకుఁ దక్క ♦ సాఁగు నెట్టు
లితరులకు శౌర్యతులితన ♦ క్రేశబద్ధ
దంతివరద మహాబల ♦ వంతబిరుద. 46

చ. తెలుఁగున బారసీని గడి ♦ దేరినవాఁడు ను హూణభాష యుం
దెలిసినవాఁడు కైసరుల ♦ తీయన కువ్విళు లూరువాఁడు ని
ర్మలచరితుండు సత్కవిప ♦ రంపరకుం బెన్నుప్రాపు వేఁట న
గ్గలిక గలండు బెబ్బులుల ♦ కంటికి గొంగ యతండు చూడఁగన్.

ఉ. పల్కులు కండచక్కెరలు ♦ భావము మెత్తనివెన్న యొప్పులం
జిల్కెడు రూపసంపదలు ♦ చిల్కహుమాయివజీరు మీఱు వే
పల్కులు పల్క నేటికి స్వ ♦ భావ మె మేటిసుధాప్రసార మీ
ముల్కన రామచంద్రవిభుఁ ♦ బోలినపూరుషవర్యుఁ డుండు నే.

ఉ. పిన్నతనాన నింతటివి ♦ వేకము గల్గి చరించు కన్నె యెం
దున్నది యత్తమామలుఁ బ్రి ♦ యుండునుఁ జేసినపున్నెమంచులో
నన్నులమిన్న లెల్లఁ గొని ♦ యాడఁ గ వేంకటలక్ష్మమాంబ వి
ద్వన్నుత రామచంద్రనర ♦ పాలశిరోమణిభార్య యొప్పెడున్. 4

క. పతిసేవ దేవగురువి
ప్రతతిసమర్చనము నున్ని ♦ రాహారాది

వ్రతములు లేని దినము లీ

క్షితిలో నాపుణ్యసతికిఁ • జేకుర వెందుఁ. 50

గీ. నీతృతీయకుమారకం • డిరవుండు

వెంకటేశ్వరరాయండు • పిన్నవాఁ డె

య్యయ్యుఁ దెనుఁగు ను నింగ్లీషు • యవనభాష

యభ్యసించుచు నున్నాఁడు • సభ్యుఁ డతఁడు. 51

వ. ఇట్టి సుప్రసిద్ధంబగునెగడికి వడసి యవక్రపరాక్రమమున ననదృశు లై సదాచారసంపన్ను లై దేవబ్రాహ్మణభక్తి గలిగి యార్యధర్మంబులను బరిపాలించుచు జగదేకవిఖ్యాతిం గన్న నీవంశంబువారికథ వ్రాయుటకన్నఁ గరణీయంబు కవితల్లజుల కెయ్యది గల్గుఁ గాన మీరు కోరిన కావ్యంబును విరచింప నీయకొనినాఁడ మీయాశయంబులఁ దీర్ప నాకు నత్యుత్సాహంబు వొడము చున్నయది చెప్ప నేల యింతకు మున్న నీకుమారరత్నం బగు రామచంద్రరాయనివలనఁ బ్రార్థింపంబడి యీకృతిం గొంతవరకు వ్రాసి యే యున్నాఁడ. అది యెట్లు సంభవించె ననిన వినుము. 52

సీ. విద్యయం దభిరుచి • వెలసి సత్కవు లన్నఁ

గావ్యంబు లన్న న • గ్గలపు గౌర

వంబున మన్నించు • వాఁడు గావున రామ

చంద్రరాయఁడు బాల్య • సఖుని నన్ను

సత్కరింపఁ గ నెంచి • సదయుఁ డై పిలిపించి

తాతముత్తాతల • తరమునుండి

తాళదళంబులఁ • దగిలి చీకుచు నున్న

కావ్యరత్నంబును • కానుపించి

గీ. వగచి విద్యకు వచ్చిన ♦ పాటు సూపి
ఋూరు వీనిని మరల వ్రా ♦ యించి ముదిరి
తం బొనర్పఁడు వలయు వి ♦ త్తం బొసంగు
వాఁడ నని చెప్పి మఱి యును ♦ బలికె నిట్లు.

మ. అవనీరాజ్యమె యున్న నేమి భుజశౌ ♦ ర్యంబున్న నేమెంతయు
స్తవనీయార్జవ మున్న నేమి బహువి ♦ త్తం బున్న నే మున్న నే
మి వివేకంబు ను విద్యావైభవమునుం ♦ బేరుం బ్రతిష్ఠాదు ల
య్యవి లోకంబున నిల్చు నే సుకవికా ♦ వ్యస్థంబు లే కాని-చోఁ

గీ. కాన మార్తండశ్రీఁ గృతినాథుఁ ♦ గా నొనర్చి
కావ్య మొక్కటి మావంశ ♦ కథనుఁ దెలుపు
నది గ నొడఁగూర్చి మముఁజరి ♦ తార్థులు గను
జేయుఁ డని నీసుతుఁడు ప్రీతిఁ ♦ జెప్పె నాకు.

ఉ. కావునఁ బద్యగద్యయుత ♦ కావ్యముకమ్మని తేనె లొల్కు శ
బ్దావళితోడఁ గూర్చి భవ ♦ దన్వయసత్కథఁ దెల్పునట్లు గా
నే విరచింతుఁ గైకొనుము ♦ నీకు శుభం బొడఁగూరు లోకసం
భావితసద్గుణాన్విత యు ♦ మాపతిరాయ ధరాధిపాగ్రణీ.

వ. అని పల్కి తద్దత్తకర్పూరతాంబూలం బంగీకరించి.

క. ఏతాదృశసత్కులసం
జాతునకు ను సుకవిపారి ♦ జాతమ్మున క
బ్జాతనయనపదసరసీ
జాతాంచితవిమలచిత్త ♦ జలజాతుసకర్ణ.

క. వితరణఖనికిఁ బరాక్రమ
జితతరణి కరాతిమత్త ♦ సింధురసృణికిన్

మతిశేషఫణికిఁ గీర్తి
ద్యుతిహసితమృగాంకఘృణికి ♦ సురునృపమణికిన్. 58

క. ధీరునకు దీనజనమం
దారునకు సమశరశరీ ♦ తనయసదృశా
కారునకుఁ దోలితతులా
భారునకు నిరుపమసత్కృ ♦ పాసారునకున్. 59

క. అర్యమసమతేజునకు న
హార్యస్థైర్యునకు ఘోటి ♦ కారోహణచా
తుర్యునకు సతతనవప
త్త్రార్యాంచత్క్రీఘుణునకు న ♦ తులధైర్యునకున్. 60

క. సోమేశ్వరసుతునకు నై
జామసమర్పితశతాంగ ♦ సామజతురగ
స్తోమునకు విభవజితసు
త్రామునకున్ దోమకొండ ♦ ధరణీశునకున్. 61

క. శాంతునకు హాయకళారే
వంతున కసమానధైర్య ♦ వంతునకు యశః
కాంతకకుబంతునకు ధీ
మంతునకు నుమాపతికృ ♦ మాకాంతునకున్. 62

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నే నొనర్పం బూనిన యీసద్గ్రంథం
బునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 63

గీ. కమలనాభునినాభిప ♦ ద్మమునఁ బొడమె
నలువ నలువకు నిలగల్గె ♦ నిల యు రెండు

భాగములు సేయఁ బ్రాగర్ధ ♦ భాగమునను
దనరె భారతవర్షంబు ♦ దక్షిణమున. 64

ఉ. కట్టనికోట యై హిమన ♦ గంబు మహోన్నతకూటకోటిఁ జూ
పట్టెడు నుత్తరంబునను ♦ వార్నిధి గంగను సింధు గూడి చూ
పట్టెడుఁ బార్శ్వవీచులను ♦ భవ్యతరంబు గ దక్షిణాశఁ గ
న్పట్టెడు లంకకుం గపులొ ♦ నర్చినసేతువు దాని కెల్ల లై. 65

మ. రమణీయత్వము సత్త్వసంపద యు పా ♦ ర్థివ్రాతమున్ భూరిర
త్నమయోద్దామఖనిప్రకాండము ను నా ♦ నాభూధరోపేతభూ
భ్రమనోజ్ఞత్వ మశేషజాతిమృగపి ♦ త్సద్యూథజీవాపగా
సముదాయంబులు గల్గి యీభారతరా ♦ ష్ట్రం బొప్పు సత్యున్నతిన్

సీ. ఒకయూరినుండి వే ♦ ఱొకయూరు చనుట కై
ఘంటాపథంబులు ♦ గ్రాలు చుండ
నాపథంబులు తక్క ♦ రావృతంబులు గాక
భటులచేఁ గాపాడఁ ♦ బడుచు నుండ
నాభటు లొగ్గి దు ♦ ర్వ్యాపారములు సేయ
కుండ రాజులు కాచు ♦ చుండువారు
నారాజులం దతి ♦ గౌరవం బెసఁగ దీ
వింతురు మార్గణ ♦ వితతి మఱి యు

గీ. నిరుగడల నీడకై చెట్లు ♦ వరుస లొప్ప
నచ్చటచ్చట డిగ్గియ ♦ లచ్చటచట
నుపవనంబులు ప్రపలును ♦ నొప్పు చుండు
బాటసారులగమిసదు ♦ పాయమునకు. 67

సీ. సకలవర్ణంబులు ♦ సాంకర్యములు లేక
సదమలరీతి నె ♦ సంగునాఁడు
రాజాభిమానంబు ♦ ప్రజ కృషి యును గల్గి
విద్యలు శాస్త్రము ♦ ల్వెలయునాఁడు
రాజులకై ప్రజ ♦ ప్రజలకై రాజులు
నుండ్రొరు ల్బాస లౌ ♦ చున్ననాఁడు
తమతమవృత్తులఁ ♦ దవిలి యెల్లరు వాని
నొనర వృద్ధికిఁ దెచ్చు ♦ చున్ననాఁడు
గీ. దివ్యసౌధంబులు ను మఱి ♦ దివ్యవస్త్ర
ములు ను దివ్యాన్నము ను దివ్య ♦ భూషణములు
వడసి తులఁదూఁగు చుండె సం ♦ పదలతోడ
భరతవర్షంబు హర్షసం ♦ పత్ప్రదంబు. 68

మ. మనకై సౌఖ్యము లెల్ల మాని యటవీ ♦ మధ్యంబునం గష్టభా
జన మైనట్టి తపఃప్రవృత్తిఁ గొని భి ♦ క్షామాత్రసంతుష్టు లై
చను పీ రత్యధికు ల్మహాత్ములు మనీ ♦ షావంతు లం చన్యజా
తి నమోవాకము సేయఁ బొల్చు నతిభూ ♦ తి న్విప్రవర్ణం బిలన్.

మ. మనలం బిడ్డలఁబోలెఁ బ్రోతురుకృపా ♦ మగ్నాత్ములాత్మార్థమొ
క్కనిమేషంబు నుఁ బోవ నీయ రరివ ♦ ర్గం బన్న లేశంబు నం
జనివా రుగ్రభుజార్జితాయతయశ ♦ స్సంపన్ను లీజోడు లం
చనువాదంబు గడించియొప్పుదు రవా ♦ ర్యప్రాభవుల్ క్షత్రియుల్.

సీ. జనుల కష్టసుఖంబు ♦ లను విచారించుచుఁ
దగురీతి నెల్లయె ♦ ద్దడుల మాన్పి

మితరశక్తిఁ గొనుచు స్వ ♦ స్థితికిఁ బాత్రము లైన
వైభవంబులకు లో ♦ పములు లేక
నడుపుచు నాల్గువ ♦ ర్ణములకుఁ దగువృత్తు
లరసి తదుచిత వి ♦ ద్యాభివృద్ధి
యొసఁగ వర్తకము క ♦ రిసెనము గోరక్ష
ణము మొద లైన క ♦ ర్మముల శాస్త్ర

గీ. విధి గఁ జేయించి వేనవే ♦ ల్విత్తములను
దేశవృద్ధికి వెచ్చించి ♦ తేజ మొప్ప
మంచిమంత్రులబుద్ధులు ♦ గొంచు రాజ్య
పాలనము సేయు చుందురు ♦ ప్రభువులచట. 7

సీ. పడవ లోడలు పొగ ♦ పడవలు మొద లైన
యానంబు లెక్క ప్ర ♦ యాణములను
జేసి దేశములు వీ ♦ క్షించి యూళులయందుఁ
బట్టణంబుల జన ♦ పదములందు
రాజధానులయందు ♦ రాజిల్లు ప్రజల యా
చారంబు లరయుచు ♦ వారి కెల్ల
వలయు వస్తువులు నే ♦ ర్పరు లగు తమవారి
వలనఁ గల్పించి త ♦ ద్వస్తుసమితి

గీ. నెగుమతులు సేసి లెక్కకు ♦ నెక్కు డైన
ధనము గడియించి తమవర్ణ ♦ ధర్మములకు
బాహిరము గాక దేవతా ♦ భక్తి గలిగి
యచట బేహారికొలము పొ ♦ ల్పొందు మఱియు. 72

సీ. ఏసస్య మేనేల ♦ నేకాలమున నెట్టి
యెరువునఁ బండు నే ♦ యేపదార్థ
ములచేత నెంతెంత ♦ గలుగు లాభము వాని
కెనఁగుకష్టము వెచ్చ మెంతదాక
యని వితర్కించి వి ♦ ద్యామూర్తులగు బ్రాహ్మ
ణులఁ బోషకు లగురా ♦ జులను బేర
సారంబు లెఱిఁగిన ♦ యూరవ్యులను విమ
ర్శించి తద్ధితబోధ ♦ సేద్యగాండ్రు

గీ. పాడిపంటలబలుపుచేఁ ♦ బ్రబలి పన్ను
లడుగక యు మున్న దీర్చిసౌ ♦ ఖ్యములఁ దేలు
చంచి తా గ్రజ సేవతా ♦ దర్శనములఁ
గడు నెసఁగి యొప్పు చుందురు ♦ కాపు లచట. 73

వ. ఇప్పగిది నన్యోన్యోపకారాయత్తచిత్తులై స్వవృత్తులయం దభిమాన
గౌరవంబులు గలిగి నలుగోలములవారు నుఁ బరస్పరమైత్రిం బ్రవ
ర్తించు చున్నెడ. 74

సీ. బంగరు మొదలైన ♦ పలులోహములయందుఁ
జందనాదికకాష్ఠ ♦ జాతియందు
నేనుగుదంతములందు ♦ మృగశృంగములయందు
శిలలందు మణులందుఁ ♦ జెక్కడంపు
పనులచేఁ జెలువారు ♦ బహువిధవస్తువు
ల్పట్టు రోమము నార ♦ ప్రత్తి యు మొదలగువానిచే నేసి ♦ నట్టివస్త్రంబులు
సృష్టిచిత్రములు ద్రా ♦ సినపటములు

గీ. నిలువుటద్దాలు ఫలము ల • నేకభక్ష్య
ములు వివిధవాద్యములు నోష • ధులు ను భరత
ఖండ మొసఁగుచు నుండె న • ఖండసరణి
నెల్ల దేశములకుఁ గొల్ల • కొల్ల గాఁగ.

సీ. పంచభూతమ్ముల • వ్యాపారములు వాని
మేళనంబునఁ బుట్టు • మేటిశక్తు
లవి యొనరించుకా • ర్యములు లోకోపయో
గమునకు నవి దెచ్చు • క్రమము బుద్ధి
బలమున నరసి ల • క్షలు కోట్లు వెచ్చించి
చూపరులకుఁ గడు • చోద్య మొప్ప
నత్యున్నతవిశాల • యంత్రశాలావళు
లమితంబులుగఁ గట్టి • యందులోన

గీ. మెఱుపుచే గాలిచేత నా • వురులచేత
నడుపు యంత్రసమూహంబు • గడలుకొల్పి
ధరణి యును దివి యు సంద్రంబుఁ • దమకుఁ గైవ
సము గ నొప్పిరి భరతవ • ర్షంపుఁ బ్రజలు.

వ. ఇట్లన్నిటం గడు పొగడ్త కెక్కి నాగరికత మిన్ను ముట్టు చున
భరతఖండంబునందు.

ఉ. రాజులు రాజులుం గడుఁ బ • రస్పరమైత్రి నెసంగ ధర్మవి
భ్రాజితులై ప్రజల్ శుభప • రంపరఁ జేలుచు సృష్టికర్తయై
రాజిలునాదిదేవునిఁ బ • రాత్పరుఁ బెక్కువిధాలఁ గొల్చుచ
వ్యాజపరోపకారసము • దంచితవర్తనల న్మెలంగుడున్.

ఉ. ఎచ్చటఁ గన్న దేవళము • లే యెటఁ జూచిన సత్త్రశాల లే
యెచ్చటఁ గన్నఁ బుణ్యనదు • లే యెటఁ జూచినఁ దీర్థసేవ లే
యెచ్చటఁ గన్న దానపరు • లే యెటు గన్న దయాసముద్రు లే
యెచ్చటఁ గన్న భక్తవరు • లే కనుపట్టుదు రాధరాస్థలిన్. 79

సీ. ఒకప్రాణికొఱ కాత్మ • సుకుమారదేహంబుఁ
గోసి యొసఁగినకృ • పాసముద్రు
లవనిఁ బరోపకా • రార్థంబు వెన్నెముకఁ
దీసి యిచ్చిన ధైర్య • ధీసమగ్రు
లాఁడినమాట కై • యాలుబిడ్డల రాజ్య
సంపదఁ బాసిన • సత్యనిధులు
జనకునానతిఁ గొన • సాగింప నడవుల
నిడుమలపా లైన • యిద్ధకీర్తుల్

గీ. లర్ధరాత్రమునందు హో • రనుచు వాన
గురియు చుండంగఁ దనయిల్లు • గూలఁ గొట్టి
యర్థియింటికిఁ గలప సా • యంబు సేసి
యసముఁ గొనిన మహోదారు • లెసఁగి రందు. 80

గీ. అట్టు లుచ్చత వెలసిన • నార్యభూమి
శతశతాబ్దంబు లక్షీణ • సంపదలకు
నునికి యై యుండి ద్వాపర • యుగమునందు
హైన్యముం జెందె దైవోప • హతినిఁ జేసి. 81

గీ. శకునిదుర్బోధలకుఁ జిక్కి • సాధు లైన
పెద్దలను ధిక్కరించి దు • ర్వృత్తిఁ బూని

యన్న దమ్ములతోఁ బోరె • నకటయాసు
యోధనుఁడు దాన వచ్చె దు • ర్యోగ మటకు. 82

ఉ. క్షత్త్రియవీరు లెల్లఁజని • చచ్చిరి దుర్భర మైనయాకురు
క్షేత్త్రమునందుఁ బోరి విధి • సేతకు నే మన వచ్చుఁ బ్రాణ మే
మాత్త్రము లక్ష్యపెట్ట కభి • మన్యుఁడు సచ్చెను సూత జాహ్నవీ
పుత్త్రులు మంది రస్త్రగురు • వుంబడె నీల్గిరి పాండవేయులున్. 83

చ. వల దని తాత సెప్పె నిద • పాడికి దూర మటంచు ద్రోణుఁడుం
బలికెను దండ్రి కూడ దనె • బావ యసంధి యె లెస్సయంచు బు
ద్ధులు తగఁ జెప్పెఁ దల్లి యిది • దోసమురా యనె నిట్టిపల్కు ల
త్తులువ నిరాకరించి కట • దుష్టుఁ డరిష్టముఁ దెచ్చె నుర్వికిన్. 84

ఉ. కోరిన యూళ్లు లైదు నివి • గో కొని పొం డని యొక్క మాటగా
వారికిఁ జెప్పి యున్న యెడఁ • బాండవు లాజికి వత్తురే సభా
స్తారులు ధారుణీశులు ఫ • సం దని మెచ్చుచు మళ్ళి యూళ్ళకుం
బోరె సుయోధనుం గొలిచి • భూప్రజ లందఱు నున్ సుఖింపరే·

చ. మఱఁదినిఁ దన్ను నవ్వె యవ • మానము ద్రౌపదిసేసెనంచుఁ దా
విరసపుజూద మాడి తగు • పెద్దలు రోయ సభం గులాంగనాం
బరములు విప్పి క్రూరుఁ డణు • మాత్రము జంకక చేసినట్టి య
ల్లరిపను లూర కేగు నె కు • లంబు నుఁ దన్నును రూపుమాప...

ఉ. చచ్చెడివాఁడు తా నొకఁడు • చావక యుగ్రరణంబునందు వి
వ్వచ్చుని గాండివంబునకు • భానుసుతోగ్రశరాళి కగ్గి నా
వచ్చెడి ద్రోణునల్లులకుఁ • బావనిపెన్గద కాపగాసుతో
ద్యచ్చటులాస్త్రసంతతికి • నాహుతిఁ జేసె సమస్తరాజులన్. 87

చ. వడముడిచేత వ్రేటు తిని ♦ పర్విడువేళఁ గిరీటిగాండివం
బడరెడువేళ భీష్ముఁడు ను ♦ నస్త్రగురుండు నుఁ గర్ణశల్యులుం
బుడమినిఁ బడ్డవేళ నిఁకఁ ♦ బోరఁగలే మని సేన లస్త్రముల్
విడిచినవేళ నైనఁ దెలి ♦ వింగనఁ డాకురురాజు మూర్ఖుఁడై.

ఉ. ఆహవదోహలుండు సక ♦ లాస్త్రవిదుండు గురుండు సూచి కా
వ్యూహముఖంబున న్నిలిచి ♦ యున్నెడఁ బాండవడింభకుండు సం
దేహము లేక చొచ్చి తన ♦ తీవ్రశరంబులఁ జేసినట్టి య
వ్యాహతసాహసంబుఁ గొని ♦ యాడరె భూప్రజ లెల్ల నేటికిన్.

చ. అనిమొనఁ బిట్టు దాఁకి హృద ♦ యంబవియం దనుఁగొట్టినట్టి ము
న్మనుమనిసాహసంబునకు ♦ మాయురె మాయురె యంచుఁదాఁ శకే
తనుఁ డెద మెచ్చఁగా వినిన ♦ తండ్రుల కాసుకుమారుచావుకం
టెను బెఱచావు నుంగలుగు ♦ నే మఱి తల్లులచింత దీరునే. 90

ఉ. పిన్నటనాటనుండి తనుఁ ♦ బెంచినభీష్మునికంటె నస్త్రసం
పన్నునిఁ జేసినట్టి గురు ♦ వర్యునికంటెను గన్నతండ్రికం
టె న్నలినాత్ముకంటె శకు ♦ నింబెద చేసి తదీయబోధచే
నన్నివిధాలఁ దెచ్చె భర ♦ తావనికిం గురురాజు దుర్దశన్. 91

సీ. సేనలుః మోహరిం ♦ చెడునేర్పు గలిగిన
సేనాధిపతులు న ♦ శించిరపుడు
హయలక్షణంబులు లా ♦ ద్యంతంబు లెఱిఁగిన
సారథు లెల్లను ♦ సమసి రపుడు
గొప్ప యేన్గుల నూలు ♦ కొల్పి పోరించెడు
మావటీ లెల్లరు ♦ మడసి రప్పు

డొక్కం డె మార్కొని ♦ పెక్కుసేనలఁ బోరు
నస్త్రవిద్యానిధు ♦ లడఁగి రపుడు

గీ. ధర్మ్మ మెచ్చటఁ జెడక యు ♦ ద్ధంబు సలుపు
రాజరాజాధిరాజులు ♦ మ్రగ్గి రపుడు
శ్రీలతోఁ దులఁ దూఁగుచుఁ ♦ జెలఁగు చున్న
భరతఖండంబు దుర్దశ ♦ పాలు సేసి. 92

సీ. భూపతు లేగినఁ ♦ బోషకభృతి లేమి
బ్రాహ్మణవర్ణంబు ♦ బ్రతుకు టెట్లు
బ్రాహ్మణుల్ సెడిన వి ♦ ద్వత్సహాయము లేమి
వృత్తులు మహిని వ ♦ ర్ధిల్లు టెట్లు
వృత్తులు చెడి పోవ ♦ బేరము లడు గంటి
యూరుజుల్ సేమంబు ♦ నొందు టెట్లు
లూరుజుల్ ది క్కరి ♦ యుండ వి త్తము లేమి
నవరవర్ణము. సౌఖ్య ♦ మందు టెట్లు

గీ. లవరవర్ణంబు సెడిన స ♦ స్యంబు లెల్ల
నలవడుట యెట్లు సస్యముల్ ♦ కలుగ కున్నఁ
బ్రజకు జీవన మెట్లు ♦ జీవనము లేమి
దేశ మె ట్లుండు యోజించి ♦ తెలియవలయు. 93

ఉ. చోరులు రాజు లైరి మరి ♦ జూదరు లెల్లను మంత్రు లైరి వా
క్ఛూరులు జోదు లై రపరి ♦ శుద్ధమధువ్రతమత్తచిత్తు లా
చారము సెప్పువా రయిరి ♦ జారులు దేశికు లైరి కట్ట! యీ
భారతభూమి యిట్టిదుర ♦ వస్థలపా లయి చెందె దైన్యమున్. 94

ఉ. ఇట్టి యవస్థ వచ్చినపు ♦ డెక్కడివర్ణము లేటియాశ్రమా
లెట్టిప్రజైకమత్య మిఁక ♦ నెచ్చటికర్మము లేటిధర్మ మిం
కెట్టిసుఖోపజీవన మిఁక ♦ కెక్కడివిద్య లిఁ కేటివృత్తు లిం
కెట్టినృపాలపాలనము ♦ నెక్కడిరాజ్యము భారతావనిన్. 95

చ. సకలమహీశు లాపగిడిఁ ♦ జచ్చిన నుర్వర కేమిద క్కరా
జకత ప్రసన్న మయ్యె దివ ♦ సంబులు చన్న కొలందిఁ దస్కర
ప్రకరము వీళ్ళు దోఁచుకొనెఁ ♦ బ్రాణభయంబున వృత్తు లెల్లమా
ని కడు వినీతిమైఁ బ్రజ వ ♦ నీస్థలులందు వసించె నత్తఱిన్. 96

చ. తలుపులు లేమిఁ గుక్కలు స్వ ♦ తంత్రముగా నిలు సొచ్చురీతి రా
జులు నశియింపఁ గా నె తతిఁ ♦ జూచివిదేశజు లొక్క రొక్క రీ
యిల కరుదెంచి దోఁచికొని ♦ రిచ్చకు వచ్చినయట్లు వేలు ల
క్షలు మఱి కోట్లు సేయఁ గల ♦ కాంచనరత్నచిరత్నవస్తువుల్. 97

ఉ. డచ్చులు పోర్చుగీజులు నె ♦ డాపెడఁ జొచ్చిరి చొచ్చి యిచ్చకున్
వచ్చినయట్లు గ్రంథము ల ♦ పారము గాఁ గొని యేగి రేమనన్
వచ్చును భారతీయులయ ♦ వస్థ దినంబులు చాల కున్నఁ బై
పచ్చడము న్హరించె నఁట ♦ పక్షులు నవ్విధ మయ్యె నద్ది యున్.

వ. ఇట్లన్నిటం జెడి భరతఖండంబు తొంటిసిరులం బాసి యత్యధమ దశకుం దిగిన హతశేషులు ను నతిదుర్బలులు ను నగు రాజకుమారులు దానిన్ భరియింప సత్తువ లేక దుర్దశలపా లైరి. దాన నార్యధర్మంబులు సెడియె. వర్ణంబులు సంకీర్ణంబు లయ్యె. వృత్తులు నశియించె ప్రజల కీతిబాధలు మెం డయ్యె. జీవితంబు దుర్లభం బయ్యె. ప్రాణార్థంబులకు సేమంబు లే కునికిఁ బ్రజ భయం బంది

స్వేచ్ఛాసంచారంబు డిగి తమగృహంబులం దడఁగి కాలంబు పుచ్చె
బలం బున్నవాఁ డెట్టి డయ్యు బలహీనుని నొంప సాగె. ఉత్తమవ
ర్గం బడు గంటి హీనజాతికి నెళ వ్వెసంగె. నిప్పగిది క్రమక్రమంబునఁ
జెడు చున్న దేశంబుఁ గాంచి వగచి వృద్ధమహర్షి జనంబు దేశారి
ష్టంబుం దొలంగింప నుంకించి బాలురు ననద లగు రాచకొడుకు
లం జేరి యతికరుణంబు గా వారిసేమంబు లరసి వారికి హితోపదే
శంబు సేసి తమ కున్న విద్యాబలంబున మఱలఁ బ్రజలం దమవశం
బు సేసికొని వేదంబులు ముఖస్థంబులు గావించి జనుల నడవడిక్కిఁ
గా స్మృతులు నిర్మించి రాజ్యంబులు స్థాపించి న్యాయస్థానంబు
లేర్పఱచి వ్యవహారకాండంబులు సాఁగించి భరతప్రపంచంబునుఁ
గొంతవట్టు కలంకఁ దేర్చిరి. అయ్యెడ విద్యకలిమి బ్రాహ్మణవర్గం
బును ననుగ్రహించి వారిశరణంబు సొచ్చి భూపతు లెల్ల వారిం బ్ర
ధానులు గా నాచార్యులు గాఁ బరిగ్రహించి తత్సాహాయ్యంబున
భూపరిపాలనంబుఁ గావింపఁ దొడఁగిరి. కావునఁ బాఱువారితో
డ్పాటు రాచవారి కనివార్యం బయ్యె. బ్రాహ్మణు లిప్పగిదిఁ బ్ర
పంచవ్యవహారభారంబునఁ దగిలి కొందఱు తమ యాశ్రమధర్మంబు
లు నడపలేనివా రైరి. కొంద ఱవి నడుపఁ గఁ గంకణంబుఁ గట్టు
కొనిరి. ఇట్లు తద్వర్ణం బిరుతెగ లయ్యె. నీరెండుతెగలం దొకరు
లౌకికవ్యవహారంబులందు ను రెండవవారు మతాచరణంబులందు
నుఁ బ్రముఖు లై మంత్రులు నుఁ దీర్థులు నైరి. ఇవ్విధంబున రా
జులకడ నతిగౌరవం బందుచు నతిప్రబలు లై వర్తిల్లు చున్న బ్రా
హ్మణులయెడ నితరవర్ణంబుల కసూయ యంకురితం బయ్యె. రా
జులతో రాజులు పోరాటములు మానిరి. గాని ప్రజలలో జాతివై

షమ్యంబులు పొడమి వారిలో వా రొకళ్ళొకళ్ళ కయ్యంబులకు దొరకొనిరి. ఎంతఁ జేసినను నితరవర్ణంబులవారు విప్రులం గెలువఁ జాల రైరి. భూపాలురు బ్రాహ్మణు లన్న భయంపడ సాఁగిరి. బ్రాహ్మణులు తమకుఁ గలిగిన యున్నతపదములను వంశపరంపరగ ననుభవించుచు గర్వించి క్రిందిజాతులపై నెక్కు డాధిపత్యము సాగించి వేదబాహ్యంబు లగు పురాణగాథలు వెలయించి ప్రజలం గర్మపరంపరయందు ముంచి మూఢాచారంబులు నించి యుద్రేకించి రట్టిమొడ. 99

గీ. జగతి శుద్ధోదనుండు నా ♦ మగధదేశ
పతి మహామాయ నా నెప్పు ♦ పరమసాధ్వి
వలన సిద్ధార్థుఁ డనుపుత్రుఁ ♦ బడసెఁ గపిల
వస్తు వన నొప్పు పురమున ♦ వరలె నతఁడు. 100

శా. ఆసిద్ధార్థుఁడు పిన్ననాఁ డె బహువి ♦ ద్యావంతుఁ డై యింద్రియ
వ్యాసంగంబునుఁ దల్లిదండ్రులను భా ♦ ర్యాపుత్త్రులం దాసదా
సీసంఘంబును వీడి యాయతతప ♦ శ్శ్రీ నొప్పె నక్షయ్యమో
క్షాసక్తిం బొలుపారు నిశ్చలమనో ♦ వ్యాపారనిష్పన్నుఁ డై. 101

చ. ధరణి నహింసకన్న నిఁక ♦ ధర్మమునుఁ మఱి భూతకోటికిం
గరుణ యొసంగు సాయమున ♦ కన్నను బుణ్యము నందఱన్సహో
దరసమదృష్టిచేఁ గనుని ♦ ధంబునకన్నను నీతి యుం బరా
త్పరు నెరనమ్మికంటెను మ ♦ తంబు ను లే దని తోఁచెదన్మతిన్.

ఉ. తోఁచినతోడ నే జనుల ♦ తోఁ దనభావము నచ్చటచ్చటన్
సూచన సేసెఁ జేసిన వి ♦ శుద్ధమనస్కుల కెల్ల దన్మతం

బాచరణీయ మంచును య ♦ థార్థమటంచునుఁ బోఁచెఁ దోఁచిన౯
ధీచతురుం డతండు తన ♦ దివ్యమతంబును సాఁచె నంతటన్. 103

గీ. అమ్మహాత్ముండు బోధించి ♦ నట్టి బౌద్ధ
మతము కోసలమగధాధి ♦ పతులచేత
మొదట నవలంబితం బయి ♦ పిదపఁ జీన
వఱకు వ్యాపించెఁ గొన్నియ ♦ బ్దములలోన. 104

గీ. ఇత్తెరంగున నిఖిలవిం ♦ ధ్యోత్తరప్ర
పంచమునఁ జీనవఱకు వ్యా ♦ ప్తమయినట్టి
బౌద్ధమత మొక్కకొంత నా ♦ బ్రాహ్మణాధి
పత్యము నడంపఁ దొడఁగె న ♦ ప్పట్టునందు. 105

ఉ. ఇండియ యందు నుండుసిరి ♦ యెచ్చట లే దని గ్రీసురా జల
గ్జాండరు దండిసేనఁ గొని ♦ చయ్యన శీతనగంబు దాఁటి రా
నుండిన గండుమీఱి పురు ♦ షోత్తమనామనృపాలుఁ డాతని౯
భండనమం దెదుర్కొనుచు ♦ వానిమహోద్ధతికిం గలంగుచు౯.

ఉ. దండిమగండు వీనిని వృ ♦ థా చెనకం దగదంచు లో నల
గ్జాండరు మెచ్చి యాతనికి ♦ గౌరవము న్నెలకొల్పి వేగ వే
దండశతాంగఘోటకప ♦ దాతియుతం బగు సైన్య మెల్ల ను
ద్దండగతి న్మరల్చి మగ ♦ ధప్రభు మార్కొన నుద్యమింపుచు౯

చ. అలజడిఁ దద్బలంబులపు ♦ డాజికి నూల్కొన కిళ్ళకేగఁ గా
సెల విడు మన్న గ్రీసుదొర ♦ చేయున దేమి యు లేక కొంతఁజిం
తిలి యట నొక్కనిం బ్రతిని ♦ ధి౯ నెలుక స్పనువాని నుంచి తా
వెలువడి యింటి కేగెఁ దల ♦ పెట్టినకార్యము మాని యత్తఱి౯.

ఉ. నందులు పాటలీపురము ♦ నం బలు పెక్కి సపత్నిసూను మౌ
ర్యుం దమ మంత్రి చెప్పిన హి ♦ తోక్తులు చేకొని వెళ్ళఁగొట్టి యి
బ్బందులువెట్ట నాతఁ డొక ♦ బ్రాహ్మణునిన్ శరణంబు వేడి తాఁ
జెందినదైన్యము న్వినికి ♦ సేసిన నాతఁడు నుం గృపార్ద్రుఁడై. 109

ఉ. శక్యము కానితంత్రములు ♦ సయ్యనఁ బన్ని యమాత్యవర్యు ని
ర్వాక్యునిఁ జేసి గెల్చి రణ ♦ పారగులై తగు గ్రీసువారితో
నైక్యముఁ జెంది నందకుల ♦ మంతయు నున్నఁగఁ జేసి యిచ్చెఁ జా
ణక్యుఁడు చంద్రగుప్తున క ♦ సంతదయ న్మగధాధిపత్యమున్. 110

వ. ఇత్తెఱంగునఁ జంద్రగుప్తమౌర్యుండు మహాపద్మాదినందులఁ జక్క డఁచి చాణక్యసాహాయ్యంబున మగధసింహాసనం బధిష్ఠించి తనరాజ్యంబునుఁ దన్నుం జెనకవచ్చిన గ్రీసురాజప్రతినిధి యగు సెల్యూకసనునతని నోడించి యతనిపుత్త్రిం బెండ్లి యాడి యార్యమతం బవలంబించి యిరువదినాలు గేండ్లు రాజ్యంబుం బరిపాలించెఁ బిదప నతనికుమారుఁడు బింబసారుండు తండ్రికంటెను రాజ్యంబు నెక్కుడు పెంచి యిరువదెనిమి దేండ్లు నిష్కంటకంబుగ రాజ్యం బేలె నతనికుమారుం డశోకుం డసదృశపరాక్రముం డై సౌరాష్ట్రకళింగాంధ్రభూనాథులఁ దన కరిగాపులం జేసికొని బహుధర్మనిరతుండై రాజ్యం బేలె. కళింగరాజులతో నతఁడు పోరునెడ యుద్ధంబున సమసినవీరభటులకళేబరంబులు గాంచి తనక్రౌర్యంబున కేవ పడి నాటినుండి యుద్ధంబులజోలి మాని భూతదయ ముఖ్యముగఁ జేరేచు బుద్ధమతంబునందు మిగులఁ బ్రీతిగలవాఁడై తన్మతంబును రాజసమ్మతంబుం జేసి తన్మతగురువుల కతివిచిత్రంబు లగు విహారంబులు గల్పించె. తనకుమారుని మహేంద్రునిఁ దనకూఁతు సం

ఘమిత్రి యనుదాని సింహళంబునకనిచి తదధీశు బౌద్ధుం గావిం
మతి యు ననేకమతాచార్యుల నంపి లాతివిలాతులందుఁ దన్మ
బుం బోధింపం జేసె. పశుమారణంబు మాన్పి సకలజనోపయోగ్య
బు గ ననేకవైద్యశాలలను దేవాగారంబులను ఘంటాపథంబులఁ
దీర్ఘికలను నిర్మింపం జేసి రాజాధిరాజబిరుదంబుఁ గైకొని చి
కాలం బాన్నృపాలుండు రాజ్యంబు పాలించె. అతనివంశంబువా ర
ుతరంబులు రాజ్యంబు సేసిరి. ఆరవతరంబునఁ బుష్పమిత్రుం డను
సేనానాయకుండు రాజుం జంపి తాను సింహాసనం బధిష్ఠించె. అతఁ
డతిదుర్బలుం డగుటవలనఁ గళింగసౌరాష్ట్రాంధ్రనాయకులు స్వ
తంత్రులై తమతమరాజ్యంబుల నేల సాఁగిరి. ఆంధ్రనాయకు లప్పు
డు మిగులఁ బ్రబలులై వింధ్యపర్వతంబుదాఁకఁ దమరాజ్యంబుఁ
బెంచిరి. పుష్పమిత్రునికాలంబున మగధరాజ్యంబు కొంత తరిగె.
పిదప గుప్తవంశంబువారు కుమారగుప్తస్కంధగుప్తులు మగధదేశం
బేలిరి. స్కంధగుప్తునిసుతుండు హూనవంశరాజగుతోరమాననువా
నిచే జయింపఁబడి మగధరాజ్యం బాతనికిఁ గోల్పోయె. తోరమా
నునిపుత్రుండు మిహిరకులుఁడు. అతనిరాక్షసకృత్యంబు సెప్ప నలవి
కాదు. ఎల్లప్పుడు యుద్ధమునం దపేక్ష గలవాఁ డగుచు రాజుల
తోఁ బోరాటములు సల్పి మిగుల జనక్షయంబుఁ గావించి చివర
కు మాళవమహీపతి యగు యశోధర్మునిచే జయింపఁబడియె. ఈ
యశోధర్ముండె విక్రమార్కనామాంతరంబున నుజ్జయినీనగరం
బు రాజధానిగా మాళవమగధాదిదేశంబు లేకఛత్రంబుగఁ బా
లించిన మహారాజశేఖరుండు. కాళిదాసవరరుచివరాహమిత్రాదు
సార్వభౌముని యాస్థానంబున వన్నెకెక్కినవారు. విక్రమార్కుని

యనంతరంబున నతనివంశంబువారుగుప్తవంశపువారిచేజయింపఁబడిరి. గుప్తవంశపురాజులగుప్రభాకరుండునుసతనిపుత్త్రిండగురాజ్యవర్ధనుండునువింధ్యోత్తరభాగంబునుప్రసిద్ధంబుగఁబాలించిరి. రాజ్యవర్ధనునిసుతుండుశిలాదిత్యుండుతనరాజధానిం గన్యాకుబ్జంబున స్థాపించి హర్షవర్ధననామాంతరంబునధనేశ్వరసింహాసనారూఢుండై నలువదేండ్లురాజ్యంబుపాలించె. రత్నావళియనునాటకరాజంబునుసంస్కృతంబున ననదృశఫక్కిని నిర్మించిన శ్రీహర్షకవి యితఁడే యని యందురు. కవిసార్వభౌములగు బాణభట్టభవభూతు లీరాజచంద్రుని యాస్థానంబు నలంకరించినవారు. శిలాదిత్యుం డేబదేండ్లు రాజ్యంబు పాలించి కీర్తిశేషుం డయ్యె. అతని యనంతరంబున లలితాదిత్యుం డను కాశ్మీరరాజు కన్యాకుబ్జనగరంబు సొచ్చి దానిసిరి యెల్ల హరించె. ఆలలితాదిత్యుం డె భవభూతిమహాకవినిఁ దనరాజ్యంబునకుఁ బట్టుకొని యేగె నని యుఁ జెప్పుట కలదు. ఇది యిట్లుండ మహారాష్ట్రదేశాధీశ్వరుఁడు ను రాజపుత్త్రవంశజుఁడు నునగు పులికేసి యనుమహారాజు పశ్చిమదేశంబున వల్లభిరాజుల నోడించి యమితసంపదలచేఁ జెలువారు చున్న తద్రాజ్యంబును దన యధీనంబు సేసికొని వింధ్యోత్తరభాగంబునఁ గన్యాకుబ్జంబువఱకుఁ దనరాజ్యంబును బెంచి మిగులఁ బ్రసిద్ధికెక్కె. ఈమహీపతి చళుక్యవంశజుఁడు. ఇట్లే పెక్కండ్రు రాజపుత్త్రవంశజులు చెలరేగి యార్యావర్తంబు ను బ్రహ్మావర్తంబు ను నలమికొని యతిప్రబలులై యార్యమతంబు నవలంబించి బౌద్ధులయెడ వైషమ్యంబుఁ బూని స్వతంత్రరాజ్యంబులస్థాపించుకొని యేల సాగిరి. బ్రాహ్మణులును వారిపక్షంబు వహించి వారిచేగౌరవంబులందుచువర్తిల్లిరి. కుమారిల

భట్టుండు ను శంకరాచార్యుండు ను నప్పా డార్యమతంబును బోధి
చుచు నితరమతంబులను జక్కడంచిరి. అనేకశాఖోపశాఖలు గ
విభాగింపఁబడి వేదనిషిద్ధంబు లగు దురాచారంబులచే నిండి యు
న్న యార్యమతంబును సంస్కరించి శ్రీశంకరాచార్యుం డద్వైత
మతంబును బోధించి ప్రజ కైకమత్యంబు దొరకొల్పె. రాజపుత్త్రి
మహీనాథు లెల్లరు నయ్యాచార్యునిమతం బంగీకరించిరి. బౌద్ధమ
తంబు ను నప్పటి కతిక్షీణదశకుం దిగి యుండినకతంబునఁ దన్మ
తావలంబకులు ను నీషద్భేదంబుచే నెలయుచు బౌద్ధమతమందు
మెల్లసదాచారంబులు గలిగి వెలయు చున్న శంకరుని యద్వై
మతంబును గౌరవపురస్సరంబు గ నంగీకరించిరి. కాన బౌద్ధులెల్ల
రు నద్వైతు లైరి. వారివిహారాగారంబులు దేవాగారంబులు గ మా
ర్పఁబడి భారతరామాయణాదిపురాణకథానాయకుల విగ్రహంబు
లందు స్థాపింపఁబడియె. అచిరకాలంబున నె శంకరాచార్యుం డతి
లోకుం డగుట యు నమ్మహనీయుఁడు బోధించినమతంబందలి
సత్యం బె ఱుంగలేక జనులు సర్వేశ్వరారాధనంబు వీడి పురాణ
కథానాయకులఁ దదవతారంబులు గ నెంచి సగుణారాధనంబుఁ
బూనిరి. ఆచారంబు లె ట్లున్నను నమ్మహనీయుని మేధాతిశయం
బువలననునయ్యాచార్యునిబోధనాసామర్థ్యంబువలనను దేశంబునం
దుఁ దొంటిమతవైషమ్యంబు లేక యైకమత్యంబు గడలుకొనియె.
రాజపుత్త్రిభూమీశు లవిచ్ఛిన్నంబు గ స్వతంత్రరాజ్యంబు లచ్చ
టచ్చట నిర్మించుకొని వర్ణాశ్రమధర్మంబులు కాపాడుకొనుచు
నొండొరులయెడ స్నేహగౌరవంబులు గలిగి ప్రబలు లై వర్ధిల్లు
చుండి రట్టియెడ.

ఉ. బర్బరు లేపుమీఱి హిమ ♦ వద్గిరిమార్గమునుండి యర్బుద
న్యర్బుదసంఖ్య గా దిగి ఘ ♦ నద్రవిణంబు హరింపఁ జొచ్చినం
దోర్బల మొప్ప వారిని నె ♦ దుర్కొని పోరిరి రాజు లెల్ల నా
కర్బురజాతి యు న్విడక ♦ కయ్యము సేసి రనేకవర్షముల్. 112

మ. జయపాలుం డనురాజు తద్యవనుల ♦ న్బాధింప నుద్యుక్తుఁ డై
హయమాతంగ శతాంగ సంకలితసై ♦ న్యశ్రేణిఁ గొంచు న్హిమా
లయముం దాటిన మ్లేచ్ఛసేన లవలీలం ♦ దాఁకి పోరాడినం
బయిలో డెంజయపాలవాహిని భయమ్ముం♦ జెందెఁ దద్ధాటికిన్. 113

చ. యవనబలంబు లంతట ర ♦ యంబున నజ్జయపాలుసేన వెం
దవిలి హిమాలయంబు వెస ♦ దాఁటి వితస్త నదిం దరించి హిం
దువులను గెల్చి తద్విభులఁ ♦ దూర్కను గా హరియించి మేటివై
భవము దలిర్ప నందుఁ దమ ♦ పాలనము న్నెలకొల్పె నేపునన్.

ఉ. భారతరాజు లిట్లు గెలు ♦ వంబడి మ్లేచ్ఛుల కిమ్మొసంగుడున్
వారి కధీన మయ్యెఁ గురు ♦ పాటలఘూర్జరమాళవాంగగాం
ధారకరూశకోసలవి ♦ దర్భవిదేహకళింగవంగసౌ
వీరసురాష్ట్రమత్స్యముఖ ♦ వింధ్యనగోత్తరముఖ్యరాజ్యముల్. 115

చ. పిదపఁ గ్రమక్రమంబునను ♦ వింధ్యము దక్షిణభూమి యుం దురు
ష్కదళిత మై తదీయనృప ♦ శాసనయష్టికి లొంగె దానబ
ల్లిదు లగు చోళకేరళత్రి ♦ లింగముఖావనినాధులున్ భయా
స్పద మగు మ్లేచ్ఛరాజపరి ♦ పాలనకుం దల లొగ్గి రయ్యెడన్.

చ. పడమరఁ దూర్పుదిక్కునను ♦ వార్నిధివింధ్యముదక్కునందుఁ గ
న్నడ మది దక్షిణంబున ఘ ♦ నం బగు నెల్లలు గా నెసంగ నె

కుఁడుసిరి గల్గి సౌఖ్యముల ♦ కు న్నెళ వై తగునాంధ్రభూమి య
ప్పుడు వశ మయ్యె రెడ్డినృప ♦ పుంగవవీరుల కాకొలంబునఁ. 117

సీ. సమదవేదండదే ♦ హము డుస్సి పో నీటె
నాటువా రిలఁ బాక ♦ నాటివారు
ఘోట్టాణమెక్కిచం ♦ గున మేటికోటలు
దాఁటువా రిలబాక ♦ నాటివారు
మృత్యుదేవత నేని ♦ నెదిరించి విజయంబు
సాటువారిలఁ బాక ♦ నాటివారు
మాకుఁ బౌరుష మె సం ♦ పద యని మీసాలు
దీటువా రిలఁ బాక ♦ నాటివారు

గీ. ప్రబలరణమున మాయాకి ♦ రాత్మత్రోడ
సాటివార య్యె యిలఁ బాక ♦ నాటివారు
వితతధర్మాచరణమునఁ ♦ గృతయుగంపు
నాటివా రయ్యె యిలఁ బాక ♦ నాటివారు. 118

క. ఆపావనవంశము సం
దీపింపఁ గఁ బొడమెఁ గామి ♦ నేడ్వాహ్వయభూ
మీపతి తద్వంశ మభి
వ్యాపించెను కామినేని ♦ వంశంబనఁ గఁ. 119

సీ. హరిహరాదు లె వచ్చి ♦ యాజినేసిననువె
న్నినివా రిలఁ గామి ♦ నేనివారు
సాహసౌదార్యాది ♦ సద్గుణంబుల నీడు
లేనివా రిలఁ గామి ♦ నేనివారు

తరుగనివిస్తార ♦ ధనసంపదఁ గుబేరుఁ
బోనివా రిలఁ గామి ♦ నేనివారు
శర ణన్న శత్రు పై ♦ శరములు చొన్పఁగా
లేనివా రిలఁ గామి ♦ నేనివారు
గీ. దేవతల కేనిఁ దమ్ము సా ♦ ధింపఁ దరము
కానివా రయ్య యిలఁ గామి ♦ నేనివారు
ధనకనకవస్తువాహన ♦ తతిఁ గొఱంత
లేనివా రయ్య యిలఁ గామి ♦ నేనివారు. 120

మ. లలితానాథపదాంబుజార్చనముహు ♦ ర్లంపాకహృద్భంభరుం
డలఘుప్రగ్రహసారనిర్మథితపీ ♦ రారిప్రతాపుండు ని
ర్మలరాచుఖ్యపవిత్రగోత్రుఁడు మహా ♦ రాజన్యచంద్రుండు ని
స్తులచారిత్రుఁడు కామినేనివిభుఁ డ ♦ స్తోకప్రభావుం డిలన్. 121

చ. అతనికివంశదీపకుఁ డ ♦ హర్పతిశౌర్యుఁడు కాచరెడ్డిభూ
పతి యుదయించి సర్వనర ♦ పాలకలోకముఁ దన్నుఁ గొల్చినం
స్తుతు లొనరింప భూరిగుణ ♦ శోభితుఁ డై పితృదత్తరాజ్యసం
భృతికి సమర్థ మైన భుజ ♦ వీర్యమునం గడుఁ బొల్చె నెంతయున్.

చ. అలఘుఁ డతండు దోర్బలబ ♦ కాంతకుఁ డై కడుఁజిన్ననాఁడె బె
బ్బులులను బట్టు సింగములఁ ♦ బోరున యూథపపఙ్క్తిఁ దెచ్చి శృం
ఖలములఁ గట్టు ఖడ్గమృగ ♦ కంఠములం దెగవేయుఁ దల్లిదం
డ్రులు మఱి సంగడీండ్రును జ♦ నుల్ దను విస్మయమందిచూడఁగన్.

వ. మఱియు.

శా. ధీచాతుర్యము మీఱ శాత్రవులథా ♦ త్రిం జొచ్చుఁ దద్దుర్గముల్
దోచ న్వాహిను లడ్డ మై యెదిరినం ♦ దోర్గర్వముం జూపు సం

క్రోచం బింత యు లేక యొక్కఁ డె మహా♦ఘోరాజిలోఁ బోరు నా
కాచారెడ్డిపరాక్రమక్రమ మనం ♦ గా లోకసామాన్య మే. 125

గీ. ఇప్పగిదిఁ గాచరెడ్డిభూ ♦ మీశమౌళి
యెదురు లేని పరాక్రమ ♦ మెసగమెసఁగ
నవని నేలంగ సుల్తాన్మ ♦ హమ్మదనెడు
హిందుపాదుష గోల్కొండ ♦ నేలుచుండె. 126

శా. ఆసుల్తానొకనాఁడు కాచవిభుధై ♦ ర్యస్థైర్యము ల్విన్నవాఁ
డై సెబాస ని మంత్రులం బిలచి య ♦ ల్లారే హుదా యెంతవాఁ
డోసూడుం డలకాచరెడ్డి మనకున్ ♦ యుద్ధంబులో నట్టివాఁ
డే సాయంబుగ నున్న మ మ్మెదురువా♦రెం దుందు రీధారుణిన్.

మ. ఇపుడే వ్రాయుఁడు శాశ్వతంపుఁగవులా♦ క్కేమాట గోల్కొండదే
శపుమధ్యంబున మెదుక్కసీమకడఁ బా ♦ శెం బిత్తు వే వచ్చి యా
నృపు నేల్కొమ్మనుఁ డంపుఁ డాతనికి సి♦ ర్పెంచాంకరాజార్హనూ
త్నపవిత్రాలఘురత్నభూష లని యా ♦ జ్ఞాపించిన న్వారునున్.

ఉ. జో హుకు మంచుఁ గేలు తల ♦ సోఁకఁగ జోహరు సేసి పాదుషా
హీహజరత్తుమాట కెదు ♦ రే యని కాలు తయారు సేసినం
దా హరుసించి దాని సుల ♦ తానుఁడు చేకొని వ్రాలు సేసి సు
స్నేహము పొంటెఁ గాచధర ♦ ణీపతిచంద్రున కంపె నంతటన్.

అట్లు సులతాను దయచేసి ♦ నట్టి కవులు
రాజబిరుదంబు నవరత్న ♦ రచితభూష
లల్లనల్లనఁ జేరెఁ గా ♦ చావనీశు
హస్తమును నాతఁ డవి శిర ♦ మందుఁ దాల్చి. 130

ఉ. బాపురె యంచు లేచి తమ ♦ వారికిఁ దచ్ఛుభవార్తఁ దెల్పి పృ
థ్వీపతి పైన మై విజయ ♦ భేరులు దిక్కులు మ్రోయఁ గృష్ణవే
ణ్యాపగ దాఁటె వారణశ ♦ తాంగతురంగపదాతిసేన సే
నాపతులు న్ధతి న్నడుప ♦ నవ్యరమాసుషమాసమున్నతిన్. 131

గీ. సపరివారంబు గాఁ గాచ ♦ నృపవరేణ్యుఁ
డిట్లు పైనంబు సాగించి ♦ యెట్టకేని
భాగ్యనగరంబునకు సమీ ♦ పమున నున్న
బాదుషా దయసేసిన ♦ వసుధఁ జేరి. 132

శా. కాంతారంబులు గొట్టి దుష్టమృగసం ♦ ఘాతంబు వేఁటాడి దు
ర్దాంతక్రూరనిశాటకర్మ మగు చో ♦ రవ్రాతముం జంపి య
భ్రాంతాత్యున్నతవప్రసంకలితహ ♦ ర్మ్యశ్రేణితోఁ గాచభూ
కాంతుం డచ్చటఁ గట్టెఁ జిత్తమలరం ♦ గంబిక్కనూలన్ పురిన్.

* మ. అది సుల్తాను ననుజ్ఞచేఁ దనకు రా ♦ జాస్థాన మై యొప్ప సం
పదలం జెన్నెసలారు స్వార్జితధరా ♦ భాగం బవిచ్ఛిన్నస
త్యదమక్షాంతిదయాగరిష్ఠుఁ డయి కా ♦ చాధీశచంద్రుండు వి
ప్రదివౌకోనివహార్చన ల్సలుపుచుం ♦ బాలించె ధర్మాత్ముఁడై. 134

చ. చిరతరకీర్తి యాతనికి ♦ సింహబలాఢ్యుఁడు భోగిరెడ్డిభూ
వరుఁ డుదయించి రాజ్యపరి ♦ పాలనభారము దావహించి సం
గరసమవర్తి నా బిరుదు ♦ గ్రాలఁ గ ధర్మము పాదుకొల్పి ము
వ్వుర సుతులం గనె న్విశద ♦ భూరిబలాఢ్యుల సచ్చరిత్రులన్. 135

గీ. కాచరెడ్డి యనం గ సం ♦ గ్రామహరుఁడు
మల్లరెడ్డి యనం గఁ గా ♦ మనిభమూర్తి

---

* హిజరీ 995 సం॥ లో కాచారెడ్డి బిక్కనూరు అనే గ్రామంబును స్థాపించెను.

బొమ్మిరెడ్డి యనం గ నం ♦ బుధిగభీరుఁ
డామువురు రాచకొడుకు ల ♦ త్యలఘు లనని. 136

ఉ. అందునఁ గాచరెడ్డినను ♦ ధాధిపుఁ డూర్జితశక్తిరాజ్యముం
బొందుగ నేలె నాతనికిఁ ♦ బుత్రకుఁ డెల్లనృపాలమౌళి సం
క్రందనతుల్యవైభవుఁ డ ♦ రాతుల కాస్పద మీఁక ధారుణీ
చందనగంధి నేలె సర ♦ సప్రభు వంచు జను ల్నుతింపఁ గన్. 137

ఉ. అన్నరపాలమౌళి యహి ♦ తాంతకుఁ గన్నధరేంద్రు శౌర్యసం
పన్నునిఁ గాచభూవిభునిఁ ♦ బర్వతరాజసమానధైర్య వి
ద్యున్నతిపాత్రుఁ బర్వతనృ ♦ పాలుని మువ్వురఁ గాంచె నందున
భ్యున్నతిఁ గాంచి కాచవిభుఁ ♦ డుర్విభరంబు వహించె ధీరుఁ డై.

మ. అనఘుండాతఁడు తిప్పమాంబ యను జా ♦ యం గూడి కాచాపురం
బును దిప్పాపుర మన్ పురంబులను సం ♦ భోరాశితుల్యంబు లై
చను నట్లందుఁ దటాకయుగ్మమును సం ♦ స్థాపించి వంశంబు పా
వనముం జేయు కుమారులం బడసె శ ♦ శ్వత్కీర్తుల న్నల్వురన్.

ఉ. జంగమరెడ్డి బాహుబల ♦ శౌర్యధురీణుఁడు కామిరెడ్డి మా
తంగబలాఢ్యుఁ డెల్లవసు ♦ ధావరచంద్రుఁడు చాపశాస్త్ర స
ర్వాంగరహస్యవేది చతు ♦ రాననతుల్యుఁడు సర్వశాస్త్రపా
రంగతుఁ డెన్న మల్లనృప ♦ రత్నము వా రిటు లొప్పి యేపునన్.

మ. తమపేర న్వెలయించి రొక్కరొక ర ♦ ర్థంబెంతయో ధారవో
సి మహాగ్రామములుం దటాకములు న ♦ క్షీణాన్నసత్రంబు ల
వ్వి మహి న్నేఁడును వారి ♦ ప్రాభవము గాంభీర్యంబుచిత్తార్ద్రభా
వము నిప్పాటివి యంచు సాటుటకు భా ♦ వ్యంబైనదృష్టాంతముల్.

సీ. త్రామంబు లేదు జం ♦ గమపల్లి కేనాఁడు
నీనాటికొాసఁగుఁ బ ♦ దేను వేలు
ఘుహిమనొప్పసఁగుఁ గా ♦ మారెడ్డిపే టనఁ
బదుమూఁడువేలకా ♦ హ్యంబు లొసఁగు
సారవంత మగు నె ♦ ల్లారెడ్డిపేట ప
దేనువేలకుఁ గొర ♦ యియ్య దెపుడు
లక్ష్యంబు లేదు మ ♦ ల్లారెడ్డిపేటకు
నిండు గా నొసఁగుఁ బ ♦ న్నెండు వేలు
గీ. నీపురము లెల్ల ♦ పదిమైళ్ళ కెచ్చు లేక
ద్రోమకొండకు నల్లంత ♦ దూరమునను
స్వీయనామాంకితమ్ము త్రా ♦ చెరువు లెనసి
కర మెసంగు సుభిక్షంబు ♦ కలిగి యిపుడు. 142
ఉ. ఈవిధి ధర్మకార్య నిర ♦ తైకమతిం జరియించు కాచధా
త్రీవరుపుత్త్రిలం దసమ ♦ ధీకుశలుం డగు కామిరెడ్డి పృ
థ్వీవలయంబు స్వీయభుజ ♦ పీఠమున న్వహియించి గోలకొం
డావనినాథుచేత వివి ♦ ధాయుతసత్కృతు లందె నిమ్మహిన్. 143
* మ. సదయుం డబ్దులషాకుతుబ్ష హిజరీ ♦ శాకాబ్దమం దేపునం
బదినూటేబదియేను వర్షమునఁ గా ♦ మారెడ్డికిం గౌరవా
స్పదచిహ్నంబులతోడ నూ ళ్ళొసఁగుచున్ ♦ సర్వాధికారంపుస
న్నదు నీరీతి నొసంగెఁ దన్నృపుని ప్ర ♦ జ్ఞాశక్తిఁ గీర్తించుచున్.
సీ. అతిభయంకర మైన ♦ యడవులనరికించి
పాటచ్చరుల నెల్లఁ ♦ బారఁద్రోలి

---

* హిజరీ 1055 లో కామారెడ్డిగారికి సంస్థానపు సన్నదివ్వఁబడెను.


1646

గ్రామము లట్టించి ♦ ప్రజలకుఁ గృషికర్మ
ములు నేర్పి వారికి ♦ వలయువిత్త
మును సహాయము చేసి ♦ ఘనతటాకములుదీ
ర్ఘికలను వెలయించి ♦ సకలధాన్య
ములు పండునట్లు భూ ♦ ములు సేసి పన్నులు
తగ్గించి ప్రభున కా ♦ దాయవృద్ధి

గీ. సేసి ప్రభునకుఁ బ్రజకును ♦ సేమ మొసఁగ
రాజకార్యధురీణుఁ డై ♦ పరఁగె గ్రామ
భూధవుఁడు కాన నతనికి ♦ భూమిశాశ్వ
తము గ దయ సేసి నామునం ♦ తసముత్తోడ. 145

గీ. మన్నె వారీపరగణాల ♦ కున్న యాధి
పత్యమును జేరి రుసుము ల ♦ వశ్యము గను
పుత్త్రపౌత్త్రపరంపరా ♦ భోగము గాన
నొప్పు మాయాజ్ఞ యిది యమ ♦ లుంచవలయు. 146

మ. అని యీరీతి లిఖింపఁ జేసి సులతా ♦ నబ్దుల్ల సన్నద్దు ని
చ్చినఁ గామావనివల్లభుండది యుఁ దా ♦ శీర్షంబునందాల్చి భా
తృనికాయంబు విధేయ మై కొలువ న ♦ ర్ధింగీర్తిఁ గామించి యే
లెను సామ్రాజ్య మకంటకంబు గ యశో ♦ లీలాసముల్లాసి యై.

చ. అతనియనుంగుఁదమ్ముఁడు మ ♦ హాయతధీనిధి మల్లరెడ్డి సం
స్కృతమున నాంధ్రమందు నస ♦ దృక్కవితారచనాసమర్థుఁ డ
ప్రతిమసమస్తశాస్త్రగణ ♦ పారగుఁ డత్యలఘుండు సర్వస
న్నుతుఁ డకలంకమూర్తిసుగు♦ ణుండును శాంతిసమగ్రుఁ డెంతయున్.

సీ. పఠియించె శ్రద్ధతో ♦ బహుశాస్త్రజాలంబు
చిత్త మెంతయు వికసిల్లునటుల
గడియించె మిగుల శ్లాఘాపాత్ర మై యొప్ప
నుభయభాషలలో న ♦ నురుమనీష
యల్ల నేర్చెను కవి ♦ తల్లజు లరు దంద
మృదుమధుమధురస ♦ దీప్తిఁ గవిత
రచియించెఁ బద్మపు ♦ రాణాదికప్రబం
ధములు నిరంకుశ ♦ ధాటి మెఱయ

గీ. నహరహము గ్రంథపఠనంబు ♦ నహరహంబు
పండితులగోష్ఠి దేవవి ♦ ప్రప్రపూజ
లహరహము సేయు ఘనుఁడు స ♦ త్యవ్రతుండు
మల్లవిభుఁ డన్న లోకసా ♦ మాన్యనృపుఁడె. 149

మ. తనకుర్ శ్రీరఘురామునందుఁ గల శ్ర ♦ ద్ధాభక్తుల న్వెల్లడిం
ప సతం డాతని కొక్కకోవెల సృజిం ♦ పంబూని తద్యత్నముం
గానసాఁగింపఁ గ జైత్రయాత్రవలనం ♦ గోటానుకోట్లర్థమా
ర్జనముం జేసి బలంబుతో మఱల స్వ ♦ గ్రామంబు రానున్నెడన్.

ఉ. వచ్చెడుత్రోవ దేవగిరి ♦ పర్వతరాజము చెంతఁ బ్రొద్దు వో
వచ్చిన నచ్చట న్విడిసి ♦ పాళెముల న్విడియించి తానునుం
బొచ్చెము లేని సౌఖ్యములఁ ♦ బొంపిరి వోవుచు విశ్రమించి త
త్సచ్చరితుం డొకింతఁ గనుఁ ♦ దమ్ములు మూయుచు నిద్రఁ జెందినన్.

సీ. తొలుకరిమబ్బుతోఁ ♦ దులఁ దూఁగు నెమ్మేని
ఛాయతోఁ దనముద్దు ♦ జాయతోడ

నానందకంద మై ♦ యలరారు ముఖవిలా
సంబుతో మందహా ♦ సంబుతోడ
భరతుని దెసఁ దాను ♦ నెరపిన మంచినే
స్తంబుతో నభయహ ♦ స్తంబుతోడ
గలువలు వెదఁజల్లు ♦ కరుణాకటాక్షవీ
క్షణముతో మంజుభా ♦ షణముతోడఁ

గీ. రాముఁ డాశ్రితసుజనని ♦ కామకాముఁ
డసమగుణధాముఁ డఖిలరా ♦ క్షసవిరాముఁ
డమ్మహామహునకు స్వప్న ♦ మందు నెదుట
నిలిచి యి ట్లనెఁ దియ్యని ♦ పలుకు లొలుక. 152

మ. తనయా ? మున్ను సురల్ సురారు లిడు బా ♦ ధల్తాళలే కబ్జలో
చనునింగూర్చి తపంబు సల్పి రిటు లీ ♦ శైలంబునం దాన న
య్యనఘుం డర్కకులంబునందు రఘురా ♦ మాంకంబునం బుట్టి సీ
తను బెండ్లాడి దశాస్యుఁ ద్రుంచె సురబృం♦దంబు ల్మోదంబందఁగన్.

గీ. దేవతలు దీనిపై నుండి ♦ దేవదేవుఁ
గూరిచి తపంబు సల్పిన ♦ కారణమున
నీనగము దేవగిరి నాఁగ ♦ నెసఁగె మఱియు
దీన నివసించు నాదేవ ♦ దేవు డిపుడు. 154

ఉ. ఇన్నగరాజ మెక్కి యొక ♦ యింతఁ గనుంగొను మిప్పు డందు నా
పన్నశరణ్యమూర్తి యొక ♦ పన్నగరాజఫణంబునీడ నీ
కన్నులకుం గనంబడును ♦ గావున నీతలపెట్టినట్టి యా
పన్నగశాయిదేవళము ♦ పన్నుగ నయ్యెడుఁ బన్ను మియ్యెడన్.

మ. అనుచుం బల్కిన రామువాక్యములు తా ♦ నాలించుచున్నంత నే
తనకుం దోఁచినదివ్యమూర్తి యపు డం ♦ తర్ధానముం జెందినం
గనుల న్విచ్చుచు లేచి హర్షపులకాం ♦ కంబు ల్తనూభాగ మె
ల్లను గప్పం గడు విస్మయంపడుచు మ ♦ ల్లారెడ్డి యుల్లాసి యై.

చ. పలికిన పల్కులెల్ల రఘు ♦ వంశవిభూషణుపల్కు లింక నీ
కల కల గాదు రాముఁ డను ♦ కంప ననుం గృతకృత్యుఁ జేసె నా
తలఁచినకార్య మిప్పుడు గ ♦ దా కొనసాఁగు నటంచు నెమ్మదిం
దలఁచుచు నమ్మహీధరము ♦ తత్క్షణ మెక్కి పరీక్ష సేయుఁడున్.

ఉ. ఏకత మిట్లు మల్లవిభుఁ ♦ డేగి కనుంగొనె నందు నొక్కని
ర్మోకము దానిచెంత నొక ♦ భోగికులేశ్వరవాసయోగ్యవ
ల్మీకము దానియందుఁ దన ♦ మేను గగుర్పడ జానకీయుత
శ్రీకరరామవిగ్రహము ♦ చెప్పఁ దలం బె తదీయపుణ్యముల్. 158

చ. ఉరగబిలంబునం దిటు ర ♦ ఘూత్తమువిగ్రహ మున్నఁ జూచి య
చ్చెరు వడి మల్లభూవిభుఁడు ♦ శీర్షము తత్పదపద్మయుగ్మమం
దిరవు గ నుంచి మ్రొక్కి యిది ♦ యే నొనరించిన పున్నె మంచు స
త్వరము గ గుళ్లు గోపురవి ♦ తానము నాయెడఁ గట్టె నున్నతిన్.

వ. ఇప్పగిది మల్లారెడ్డిభూపకులతిలకుండు శ్రీరామునకచ్చట దేవాలయం బు నిర్మించి దాని కుత్తరభాగంబునఁ బార్వతీసనాథుం డగు శ్రీరాజరాజేశ్వరుఁ నొక్కకోవెల నెలయించి యాహరిహరుల కనేకోత్సవంబులు నెరపె. మఱియుఁ దదుభయదేవాంకితంబులు గ శివధర్మోత్తరీయ, బ్రహ్మోత్తరఖండ, సూతసంహితా, పద్మపురాణ, వాసిష్ఠ, లైంగ్య, బాలభారత, కిరాతార్జునీయ, షట్చక్రవర్తిచరిత్రాద్యనేక

నానందకంద మై ♦ యలరారు ముఖవిలా
సంబుతో మందహా ♦ సంబుతోడ
భరతుని దెసఁ దాను ♦ నెరపిన మంచినే
స్తంబుతో నభయహ ♦ స్తంబుతోడ
గలువలు వెదఁజల్లు ♦ కరుణాకటాక్షవీ
క్షణముతో మంజుభా ♦ షణముతోడఁ

గీ. రాముఁ డాశ్రితసుజనని ♦ కామకాముఁ
డసమగుణధాముఁ డఖిలరా ♦ క్షసవిరాముఁ
డమ్మహామహునకు స్వప్న ♦ మందు నెదుట
నిలిచి యి ట్లనెఁ దియ్యని ♦ పలుకు లొలుక. 152

మ. తనయా ? మున్ను సురల్ సురారు లిడు బా ♦ ధల్తాళలే కబ్జలో
చనునింగూర్చి తపంబు సల్పి రిటు లీ ♦ శైలంబునం దాన న
య్యనఘుం డర్క కులంబునందు రఘురా ♦ మాంకంబునం బుట్టి సీ
తను బెండ్లాడి దశాస్యుఁ ద్రుంచె సురబృం♦దంబు ల్మొదంబందఁగఁ.

గీ. దేవతలు దీనిపై నుండి ♦ దేవదేవుఁ
గూరిచి తపంబు సల్పిన ♦ కారణమున
నీనగము దేవగిరి నాఁగ ♦ నెసఁగె మఱియు
దీన నివసించు నాదేవ ♦ దేవు డిపుడు. 154

ఉ. ఇన్నగరాజ మెక్కి యొక ♦ యింతఁ గనుంగొన్న మిప్పు డందు నా.
పన్నశరణ్యమూర్తి యొక ♦ పన్నగరాజఫణంబునీడ నీ
కన్నులకుం గనంబడును ♦ గావున నీతలపెట్టినట్టి యా
పన్నగశాయి దేవళము ♦ పన్నుగ నయ్యెడుఁ బన్ను మియ్యెడన్.

మ. అనుచుం బల్కిన రామువాక్యములు తా ♦ నాలించుచున్నంత నే
తనకుం దోఁచినదివ్యమూర్తి యపుడం ♦ తర్ధానముం జెందినం
గనుల న్విచ్చుచు లేచి హర్షపులకాం ♦ కంబు ల్తనూభాగ మె
ల్లను గప్పం గడు విస్మయంపడుచు మ ♦ ల్లారెడ్డి యుల్లాసి యై.

చ. పలికిన పల్కులెల్ల రఘు ♦ వంశవిభూషణుపల్కు లింక నీ
కల కల గాదు రాముఁడను ♦ కంప ననుం గృతకృత్యుఁ జేసె నా
తలఁచినకార్య మిప్పుడు గ ♦ దా కొనసాఁగు నటంచు నెమ్మదిం
దలఁచుచు నమ్మహీధరము ♦ తత్క్షణ మెక్కి పరీక్ష సేయుఁడున్.

ఉ. ఏకత మిట్లు మల్లవిభుఁ ♦ డేగి కనుంగొనె నందు నొక్కని
ర్మోకము దాని చెంత నొక ♦ భోగికులేశ్వరవాసయోగ్యవ
ల్మీకము దానియందుఁ దన ♦ మేను గగుర్పడ జానకీయుత
శ్రీకరరామవిగ్రహము ♦ చెప్పఁ దలం బె తదీయపుణ్యమున్. 158

చ. ఉరగబిలంబునం దిటు ర ♦ ఘూత్తమువిగ్రహ మున్నఁ జూచి య
చ్చెరు వడి మల్లభూవిభుఁడు ♦ శీర్షము తత్పదపద్మయుగ్మమం
దిరవు గ నుంచి మ్రొక్కి యిది♦యే నొనరించిన పున్నె మంచు స
త్వరము గ గుళ్లు గోపురవి ♦ తానము నాయెడఁ గట్టె నున్నతిన్.

వ. ఇప్పగిది మల్లారెడ్డిభూపకులతిలకుండు శ్రీరామునకచ్చట దేవాలయం
బు నిర్మించి దాని కుత్తరభాగంబునఁ బార్వతీసనాథుం డగు శ్రీరా
జరాజేశ్వరున కొక్కకోవెల వెలయించి యాహారిహారుల కనేకోత్స
వంబులు నెరపె. మఱియుఁ దదుభయదేవాంకితంబులు గ శివధ
ర్మోత్తరీయ, బ్రహ్మోత్తరఖండ, సూతసంహితా, పద్మపురాణ, వాసిష్ఠ,
లైంగ్య, బాలభారత, కిరాతార్జునీయ, షట్చక్రవర్తిచరిత్రాద్యనేక

ప్రబంధంబు లొనర్చి యప్పుడ గోలకొండ నేలు చున్న కుతుబు
షాహిపాదుషావలన ననేకబిరుదంబు లందె. తనకుమారునిపేర
రామారెడ్డిపేట యనుగ్రామంబు నిర్మించి భూసురుల కందనేకవస
తు లేర్పరచె. ఇట్లుమల్లారెడ్డిధరాకాంతుం డప్రతిమం బగుకీర్తి యార్జిం
చె నిట్లు జగదేకవిఖ్యాతిచే నెసంగు చున్న కాచావనీంద్రుపుత్త్రచ
తుష్టయంబునందు జంగమరెడ్డిభూపాలునకుఁ గాచారెడ్డి యును
కామారెడ్డిజనవరునకు సదాశివరెడ్డి లింగారెడ్డి యు నెల్లారెడ్డివసు
ధానాయకునకు విస్సారెడ్డి ముత్యంరెడ్డి చినకామారెడ్డి యు మ
ల్లారెడ్డివిశ్వంభరాధీశునకు రామారెడ్డి చంద్రారెడ్డి యెల్లారెడ్డి యు
నుఁ గలిగి సుప్రసిద్ధు లయిరి. అందు నెల్లారెడ్డిమహీంద్రనందనుం
డగు చినకామారెడ్డి రాజ్యభారంబు వహియించె. 160

మ. చినకామక్షితిపాలశేఖరుఁడు గాం ♦ చెంబోతధాత్రీంద్రుఁ గ
ర్ణనిభోదారగుణాఢ్యు ధీకలితుఁ గం ♦ తారెడ్డిభూనాథు స
జ్జను నెల్లాధిపు వీరిలో మరలఁ బో ♦ తారెడ్డిభూజాని గాం
చెను జోగావనికాంతుని న్మరియు ల ♦ క్ష్మీవంతు నెల్లప్రభున్. 161

గీ. అందు జోగాచలాభర్త ♦ యవనిఁ గాంచె
బోతభూనాథు జోగావ ♦ నీతలేంద్రు
వీరిలోఁ బోతభూనేత ♦ పృథ్వియేలి
కనియె రాజన్నచౌదరి ♦ యనుసుపుత్త్రు. 162

శా. ఆరాజన్నవసుంధరావరుఁడు ని ♦ త్యంబున్ భవానీశసే
వారాజద్ధృదయాంబుజాతుఁ డయి దే ♦ వబ్రహ్మసంతర్పణ
ప్రారంభంబులఁ బ్రొద్దు పుచ్చు చలమా ♦ యాబద్ధమైనట్టిసం
సారక్లేశములోఁదవుల్కొనక మో ♦ క్షప్రాప్తిఁ గాంక్షించుచున్.

సీ. అరుణోదయమున ని ♦ ద్దుర లేవని దినంబు
గంగలోఁ దొలిగ్రుంకు ♦ గనని వేళ
భోగీశభూషణు ♦ పూజ సల్పని వార
మన్నదానము సేయ ♦ నట్టిదివస
మర్థిజనమ్ముల ♦ నాదరింపని ప్రొద్దు
పెద్దలసత్కథ ♦ ల్వినని నాఁడు
ప్రజల తాపత్రయ ♦ బాధ మాన్పని కాల
మాహారిఁ దలపెట్ట ♦ నట్టిసమయ

గీ. మెచ్చుటను లేక యతిశాంత ♦ వృత్తిఁ దవిలి
జనకరాజర్షి చందాన ♦ ఘనతపోగ
రిష్ఠుఁ డై ధర్మ వెందును ♦ రిత్త వడని
యట్లు రాజన్న చాదరి ♦ యవని నేలె. 164

సీ. కనకకుడ్యంబులు ♦ గ్రాల మహోన్నత
ప్రాసాదపఙ్క్తులు ♦ వరలఁ జేసి
సకలఫలావనీ ♦ జము లొప్ప సర్వర్తు
సౌఖ్యదంబు గ వన ♦ చయముఁ బెంచి
శతసహస్రములు గా ♦ జన్నము ల్సేయించి
దేవభూసురులను ♦ తృప్తిపఱచి
మేటిరామన్నరెడ్డి ♦ పేట యాత్మస్థాన
ము గఁ జేసి దేవేంద్ర ♦ భోగ మొప్ప

గీ. నచటిహరిహర దేవాల ♦ యంబులందుఁ
బాంచరాత్రాగమాంచిత ♦ షక్కి నెల్ల

యుత్సవంబులు నెరపుచు ♦ నుచితరీతి
రాజరాజన్న చాదరి ♦ ప్రబలె నపుడు. 165

ఉ. ఢిల్లినవాబు కేని(దన ♦ శ్రీవి యెసంగని యట్టు లాధరా
వల్లభు( డుత్తమం బయిన ♦ భాగ్యము బొంపిరివోవుచుండ( గా
నుల్లమునం దసూయ(గొని ♦ యొయ్యన(గొందఱుగోలకొండకుఁ
వెళ్ళి నవాబుసన్నిధిని( ♦ బ్రేలిరి లేనివి యున్న వన్నియుఁ. 166

సీ. ముత్యాలసరులతో ♦ మోసల్లు మొన్న(గ
ట్టెను రాజరాజన ♦ యనుచు( గొంద
ఱుపరంజియిష్టక ♦ లమర( గట్టించె గు
ళ్లను రాజరాజన్న ♦ యనుచు( గొంద
ఱరు దైన రత్నమ్ము ♦ లలవడ( గోట( గ
ట్టెను రాజరాజన్న ♦ యనుచు( గొంద
ఱెరిన పచ్చల ♦ తోరణంబులను గ
ట్టెను రాజరాజన్న ♦ యనుచు( గొంద

గీ. ఱనుదినంబును( జెవిచెంత ♦ జనులు చేరి
యనెడుమాటలు విని విని ♦ మనసునందు
మిక్కుటం బైన యీసు (గ ♦ మ్మిక్కొ నసప్పు
డతని సాధించువెర వెయ్య ♦ దనుచు నెంచి. 167

ఉ. ఆతని కున్న సంపదల ♦ కచ్చెరువం దిదకన్నవా బ దె
ట్లీతని కింతలేసిసిరు ♦ లిప్పుడు వచ్చె నటంచు నాధరి
త్రీతలనాథునిం బొదివి ♦ తే వడి నానతి యియ్య సైన్యముల్
భూతల మంతటం దిరిగి ♦భూవిభు( బట్ట( గ నుద్యమించిరఁ. 168

ఉ. ఎన్నివిధాలఁ బట్టుటకు ♦ నెంచినఁ జౌదరి యోరసిల్లి తా
నున్న తెఱం గెఱుంగనియ ♦ కున్న నొకానొకనాఁడు దేవతా
సన్నిధి నిష్ఠ నున్నపుడు ♦ సైన్యము లాతనిఁ జుట్టుముట్టి య
స్నన్న యిఁ కెందుఁ బోనియకుఁ ♦ డంచొక పెట్టునఁదారసిల్లినన్.

ఉ. సిందుసమాధి నున్న యవ ♦ సీతలనాథుని రెండువైపులం
దుండు విభూతి యుండలపు ♦ డుగ్రమృగేంద్రము లై యెదిర్చి యు
ద్దండత వచ్చు నత్తురక ♦ దండును దాకిన భీతిఁ జెంది యీ
గండము దాటు టె ట్లని వి ♦ కావిక లై యది పాఱె దిక్కులన్.

చ. అఱిముఱి యిట్లు పాఱి కొస ♦ కందఱు నొక్కెడఁ జేరి బాపురే.
మఱువుఁడు చౌదరిం బొదవు ♦ మాటలు చావక తక్కెనార మిం
కరయఁ గఁ బ్రాణ మున్న బలు ♦ సా కయినం దినవచ్చు నంచు వే
దిరిగె బలంబు లెల్లఁ బోరిఁ ♦ దెల్పె నవాబున కెల్లసంగతుల్. 171

చ. అది విని యన్నవాబు వహ ♦ వా మనచౌదరి యెంతగొప్పవాఁ
డదటున నాతనిం జెనకు ♦ టావిషసర్పముతోడఁ బోరుటల్
గద యిఁక మానుఁ డాపని సు ♦ ఖంబున నాతనితోడ నెయ్యముం
గొదకొన నుండవచ్చు మన ♦ కు న్ననవారికి సేమ మొప్పఁ గన్.

చ. అని యది యాది గా మనము ♦ నందలిమచ్చర మెల్ల మాని రా
జననరపాలుతో నతఁడు ♦ సఖ్యము సేసి సుఖించె నంత రా
జన తనరాజ్యము న్మద మె ♦ సంగఁగ నేలుచు నొక్కనాఁడు స
జ్జనుఁ డతఁ డింతకుం దనకు ♦ సంతతి లేమికిఁ జింత సేయుచున్.

ఉ. విశ్వహితంబుపొంటె నల ♦ వేములవాడ వసించుచున్న రా
జేశ్వరు భక్తిఁ గొల్చి తద ♦ భీష్టముఁ దెల్ప నతండు నీ కిలన్.

శాశ్వతకీర్తిఁ దేఁ దగిన ♦ శౌర్యధురీణుఁడు గల్గు వాని రా
జేశ్వరుఁ డంచుఁ బిల్చునది ♦ యింతియె కా దిఁక నేటనుండియున్.

గీ. మహినిరాచుళ్ళగోత్రంబు ♦ మాని మీరు
పిలుచుకొనుఁ డింతనుండి రే ♦ పిళ్ళగోత్రు
లనుచు వచియించి రాజన్న ♦ కనులు తెరచు
నంతలోనఁ దిరోహితుఁ ♦ డయ్యె భవుఁడు. 175

గీ. అట్లు చూదరి రాజేశ్వ ♦ రాఖ్యసుతునిఁ
బడసి కొన్నాళ్ళ కతనినిఁ ♦ బట్టభద్రుఁ
జేసి సతితోడఁ జేరె సం ♦ సృతులు రోసి
భక్తజనరాశి యఘనాశి ♦ వారణాశి. 176

గీ. అరిగి శ్రీవిశ్వనాథపా ♦ దారవింద
ములను గొలుచుచు సత్త్రశా ♦ లలను దీర్ఘి
కలను వెలయించి ధర్మమా ♦ ర్గమున నచటఁ
గాలమునుఁ బుచ్చె నకలుష ♦ కర్ముఁ డగుచు. 177

సీ. కొక్కొ-రో యని తొలి ♦ కోడి కూయఁగ లేచి
హరహరా యని గంగ ♦ యందు గ్రుంకు
రవి పూర్వగిరి జాజు ♦ రంగు చల్లక మున్న
విశ్వేశుశిరమున ♦ బిల్వముంచు
దీను లైవచ్చి య ♦ తిథులు వేడక మున్న
చవు లూర భక్ష్యభో ♦ జ్యములు పెట్టుఁ
జిత్తచాంచల్యంబు ♦ చేకూరకయ మున్న
భగవంతునికథాశ్రి ♦ వణము సేయుఁ

గీ. గాల మంత యు మోక్షైక ♦ కాంక్ష నిట్లు
గడపి రాజన్న సతిత్రోడ ♦ గాసియం దెం
గాలధర్మంబు నొందె నా ♦ కాలకంఠు
భక్తనామాంకములు నేడుఁ ♦ బరగు నచట. 178

శా. ఆరాజన్న వసుంధరావరసుతుం ♦ డత్యంతధీశాలి యా
శ్రీరాజేశ్వరరాయఁ డంతట ధరి ♦ త్రీభారముం బూని మ
త్తారిక్ష్మావిభుమూర్ధసంకలితపా ♦ దాంభోజుఁ డై దీనమం
దారుం డై చిరకీర్తిఁ గాంచె నిలవి ♦ ద్యాభోజుఁ డై పూజ్యుఁ డై.

గీ. అధికఫలవంతము లగుత్యే ♦ త్రాళిచేతఁ
జెలఁగు చెన్నూరు మొదలైన ♦ సీమలెల్ల
గుత్తఁ గొని గోలకొండరా ♦ జోత్తమునకు
మిగులహితుఁ డౌచు నతఁ డొప్పు ♦ మీాత్ర నంత. 180

* ఉ. బీరము లేక యున్నఁ బృధి ♦ పీతల మేటికి నేను వీని కె
ట్లోరిచి పన్ను గట్టుదు న ♦ హో పులి మేకకు లొంచ్చెయంచుఁజె
న్నూరువిభుండు ప న్నియక ♦ యూరక రాజనృపాలు నాజిలోఁ
బోరఁ గ నూల్కొ నెం బొగరు♦పోతయిచివ్వకుఁగాలుద్రవ్వుచున్.

చ. క్రొలఁది యెఱుంగ కిప్పగిదిఁ ♦ గుత్సితుఁ డాదొర పోతరించి సే
నలు వెసఁ బ్రోవు సేసి గవి ♦ నల్కొగసాళ్ళనుఁ గందకాలు త
ల్పులు బురుజు ల్పరాయిదొర ♦ పోటున కెక్కడ జంకనట్లు కా
వలసినచోటు లంతటను ♦ భద్రము సేసి కృతప్రయత్నుఁడై. 182

చ. బురుజులపైఁ బిరంగులను ♦ మోపి గడీలు తగిల్చి నీళులం
బరిఖలఁ బెట్టి బాకులు తు ♦ పాకులు విండ్లనుఁ గత్తు లీటెలున్

* హిజరీ 1202 సం॥ లో చెన్నూరుయుద్ధము జరిగినపిదప హిజరీ 1205 సం॥ లో ధోమకొండ సంస్థానంబు స్థాపించెను.

వరుసలు దీర్చి పేరొడిసె ♦ పగ్గముల న్సరి మందుగుండ్లు నున్
సరిగ నమర్చి బల్జబురు ♦ జంగులు బారులు దీర్చి యంతటన్. 183

మ. వరవేదండములు న్హయోత్కర మని ♦ డ్వాహంబులుం బండ్లు న్స
త్వర మొప్పం జతనంబు సేసి తగుసం ♦ బారంబులుం గూర్చి సం
గరభేరీరవనిర్దళద్గగనభా ♦ గం బొప్ప రక్తాంబరో
త్కరరంగత్తతకేతనావళులు ప్రా ♦ కం జేసె సత్యున్నతిన్. 184

గీ. సర్వ మి ట్లాయతము సేసి ♦ సమరమునకు
గాలుద్రివ్వుచుఁ జెన్నూరు ♦ పాలకుండు
బిక్కనూలునృపాలుని ♦ పేర నొక్క
కమ్మ వ్రాయించి గుంగురు ♦ కట్టి సపుడు. 185

గీ. కమ్మఁ గైకొని వేగ జం ♦ ఘాలుఁ డొకఁడు
గజ్జియలకట్టు మ్రోగ శీ ♦ ఘ్రింబ వచ్చి
దాని రాజేశ్వరావనీ ♦ ధవున కొసఁగి
యరిగె నది గొని యాతఁ డ ♦ బ్బురము పడుచు. 186

గీ. మంత్రుల బిలచి చెన్నూరు ♦ మనుజవిభుఁడు
పంపె నట దీనిఁ జదువుఁ డ ♦ పాత్రుఁ డేమి
వ్రాసె నో యన్న నాజాబు ♦ వారు విప్పి
చదివి వినిపించి రిట్టు లా ♦ శ్చర్య మొప్ప. 1

ఉ. ఉన్నతరాజ్యముం బలస ♦ మూహము మీవలె మాకు నుండియున్
బన్నులు కట్టి మమ్ము బల ♦ వంతము పెట్టుట యేటిపాడి రా
జన్న య వెల్ల నింతవఱ ♦ కారసి సైచితి మిప్పు డన్నము
న్నున్నవిధంబు కాదు మఱి ♦ యు న్వినుఁ డున్న తెఱంగు సెప్పెదన్.

ఉ. నిన్నటిదాఁక నిన్నుఁ గరు ♦ ణించితిఁ బన్నులు కట్టి యింక ముం
దన్న నె చెల్ల వట్టిపరి ♦ యాచకము ల్మనచెంత ధైర్యసం
పన్నుఁడ వేని రమ్ము మన ♦ బాహుబలంబు లెఱుంగవచ్చు లే
దన్న వృథాభిమానపడ ♦ కల్లన నింతట నూర కుండుమీ. 189

చ. అని వినిపింప భూపతి య ♦ హో యని నవ్వుచు గుఱ్ఱు వచ్చి పి
ల్లను వెరపించినట్టులు ప్ర ♦ లాపము లె ట్లొనరించెఁ గంటి రే
యని తనమంత్రులం గని ప్రి ♦ యంబున వారికి నానతిచ్చె ని
ట్లని సభనున్నయందఱును ♦ నచ్చెరు వందుచుఁదన్నుమెచ్చఁగన్.

మ. మనసేన ల్జతనంబు సేసి తగుసం ♦ భారంబులం గూర్చి కో :
టను నల్దిక్కులఁ గాపు సేసి వడి జెం ♦ డా లెల్ల నెత్తించి చ
య్యనఁ జెన్నారును రేపె చేఁగొనఁగ సా♦ధ్యంబైనమార్గంబు యో
జన సేయుం డని యానతిచ్చి కొలువుం ♦ జాలించిన న్మంత్రులున్.

గీ. ప్రభువు సెప్పిన పగిది స ♦ ర్వము ను సిద్ధ
పఱచి చతురంగబలములు ♦ భండనమున
కాయితము సేసి యచటివృ ♦ త్తాంతమెల్ల
బాదుషాకెరిగించిరా ♦ పతియునంత. 192

గీ. తులువ చెన్నారుదారి యింత ♦ తుచ్ఛమైన
కార్య మొనరించె నే యని ♦ కనలి యపు డె
మండలాధీశు శౌర్యస ♦ ముగ్ర సైదు
ఖాను రప్పించి తగురీతి గౌరవించి. 193

సీ. నవరత్నవిరచితా ♦ నర్ఘంబు లగు తురా
సర్పేంచు లనెడు భూ ♦ షణవితతి యు

బాహ్లీకారట్టబ ♦ ర్బరసింధుగాంధార
జాతసలక్షణ ♦ సైంధవములు
మహిసూరుకటకబ ♦ ర్మాదేశవనజన్య
మత్తమాతంగోత్త ♦ మవ్రజంబు
రజితకాంచనతంతు ♦ రచితనానావర్ణ
వర్ణనీయోత్తమ ♦ వస్త్రములు ను

గీ. నిగనిగని మేటి మగఱా గ ♦ నీ బెసంగు
చంద్రహాసంబు మండలే ♦ శ్వరున కొసఁగి
యతని బిక్కనిపోలు భూ ♦ పతికి సాయ
మంపెను నవా బతండు ను ♦ నరుగుదెంచె. 194

ఉ. వచ్చిన యచ్చమూపతి క ♦ పారబహూకృతు లిచ్చి సేనకుఁ
హెచ్చగ బత్యము ల్గొలిచి ♦ యేడ్తెర రాజనభూవరేంద్రుఁ డిం
పచ్చపడ న్నవాబు తన ♦ కప్పు డొసంగిన మంచి సాయము
న్మెచ్చుచు సైదుఖానుఁ గని ♦ మిక్కిలి నెయ్యముఁజూపియిట్లనెఁ.

మ. ఇదె చెన్నూరువిభుండు వ్రాసినది మీ♦ రేచూడుఁ డిందేమియు
న్నది నాత ప్పతఁ డూర కేయిటులు నిం ♦ దాముగ్నుఁ గావించిన
న్నెదిరింపం దలఁకోలు బా గగు నె తా ♦ నేయెంతవాఁ డైన నఁ
బెదరింపం బని యేమి యంతలగు వే ♦ మేమన్న చోవానికిఁ.196

గీ. గోలకొండనవాబుచే ♦ గుత్త గొనిన
గ్రామముల కెట్లు మాకు రొ ♦ క్కంబు వచ్చు
నంద ఱి క్లెదిరించిన ♦ ముందు మేము
చేయునది యెద్ది మీర లే ♦ చెప్పవలయు. 197

మ. అనినన్ ఖానుఁడు లేచి యేల యిటు రా♦జామీరు వ్యోజింప నా
క్కనిమేషంబునఁ బట్టి తేఁగలము త ♦ ద్గర్వాంధుని న్లెండు మీ
రని కాయత్తపడుండు సైన్యములు మా ♦ స్వాధీనముం జేసి మా
ఘనచాతుర్యము సూడుఁడీ యనుచుఁబ♦ల్కన్మెచ్చి రాజన్నయున్.

సీ. గంగాచ్ఛవార్యవ ♦ గాహసం బొనరించి
ధాతశుభ్రాభ్రభవ ♦ స్త్రములు దాల్చి
శైలకన్యాస్వామి ♦ సత్పూజ లొనరించి
విప్రదత్తాక్షత ♦ ల్స్వీకరించి
మంత్రిసామంతక్ష ♦ మానాథులను గూడి
డంబుగానొడ్డోల ♦ గంబు దీర్చి
పోరఁ జాలినమంచి ♦ మొనగాండ్రఁ గడు నెంచి
వారికి సేనాధి ♦ పత్య మిచ్చి

గీ. సర్వసేనలకును గులాం ♦ సైదుఖానుఁ
బట్టముం గట్టి చెన్నూరు ♦ పట్టుటకును
మొనలు రాజేశ్వరవిభుండు ♦ మొగ్గరించి
మించి ప్రస్థానభేరి వే ♦ యించె నపుడు. 199

చ. సనికెలు పెద్దపారలు ను ♦ శాణములుం గునపాలు పెద్దని
చ్చెనలు ను సమ్మెటల్గొలుసు ♦ చేదలు గుద్దలు లిన్పగొడ్డళుల్
మునిపెనత్రాడులుం డగరు ♦ మోరలఘట్టనయంత్రము ల్వెసం
గొని మొన కగ్రభాగమునఁ ♦ గొన్ని దళంబులు నిల్చె నేపునన్.

ఉ. దానికి వెన్క నిల్చెను ప ♦ దాతిచమూతతి యశ్వసేన య
ద్దానికి వెన్క నిల్చెను మ ♦ దావళము ల్మసలాళితోడ వ

ద్దానికి వెన్క నిల్చెను శ ♦ త ఘ్నులు మోపినబండ్లగుంపు నీ
సేనకు రెండువైపులను ♦ జేకొనినిల్చెలయాగ్ని గుప్పచుక.

వ. అంత.

సీ. వందిమాగధులకై ♦ వారము ల్మిను ముట్టఁ
గయిఁగత్తిబూని గ ♦ ద్దియను డిగ్గి
భూసురాశీర్వాద ♦ ములు దిక్కుల లదుంగఁ
గలభయానమున మో ♦ సళులు గడిచి
వాహినీశులు కర ♦ వాలము ల్సవరింప
మొనలది క్కొక్కొంత ♦ మొగము సేసి
చలిమలపట్టికా ♦ ళులు మదిఁ దలపెట్టి
మదహస్తి మొక్కనం ♦ బారి యెక్కి

గీ. సేన లెల్ల గులాంసైదు ♦ ఖాను నడప
సచివులు నుఁ జారులు ను నుండ ♦ సంజ్ఞఁ జేసి
బిక్కనూలుధరాధీశుఁ ♦ డక్కజము గ
దాడి వెడలెను చెన్నూరు ♦ ధవునిమీఁద. 203

గీ. వెడలి చెన్నూరు చేరి త ♦ ద్విభునిసేన
తోడఁ బోరాడి పోరాడి ♦ తుట్టతుదకు
శతృసైన్యంబు నుగ్గునూ ♦ చంబు సేసి
ముట్టడించెను తద్దుర్గ ♦ మును కడంక. 204

సీ. సీలలు త్రిప్పి ని ♦ శ్రేణిక ల్మత్తించి
వప్రికుడ్యంబులు ♦ ప్రాఁకి ప్రాఁకి
గొలుసులచేఁ బిరం ♦ గులు కట్టి మోపెట్టి
లలి బురుజులమీఁద ♦ లాఁగి లాఁగి

తగరుమోరటయంత్రి ♦ తతి యుయ్యెలలు గట్టి
కోటవాకిళుల డీ ♦ కొల్పి కొల్పి
పాణాలపై నాస ♦ మాని మార్కొని పోరు
నరిసేన స్వర్గాన ♦ కనిచి యనిచి

గీ. బరవసంబున రాజన్న ♦ వసుమతీశు
సేన భేదించెఁ జెన్నూరు ♦ మానవేంద్రుఁ
గంచుగుబ్బలతల్పులు ♦ మించుకోట
వెలుఁగుపడి శత్రుసేనలు ♦ పిచ్చలింప. 205

గీ. కోటతల్పులు బద్దలు ♦ కొట్టి బిక్క
నూలుసేనలు లోఁ జొరఁ ♦ గాలు వెట్ట
నచటఁ జెన్నూరుబల మడ్డి ♦ యాపె దాని
నంత నిరువాగునకునుఁ బో ♦ రగ్గలించె. 206

చ. కనుగొన నీటె లీటెలునుఁ ♦ గత్తులు కత్తులు విండ్లు విండ్లు పో
రెనో యనునట్టు లేపుమెయి ♦ రెండుబలంబులు పోరి పోరి మెం
దును నెడ మీయ కిర్వురునుఁ ♦ ద్రోపుడులాడుచు బెక్కరందు నిం
దునుఁ బడి యీల్గుచుం డఁ గఁగ♦నుంగొనిసాహసమొప్పనంతటన్.

మ. ఘనవేదండము డిగ్గి వేగ తనకం ♦ ఖాణంబుపై నెక్కి చే
తనిశాతాసి ధరించి సేనలకుఁ బ్రో ♦ త్సాహంబుఁగల్పించి రా
జనభూపాలుఁడు ద్రోసి ముందు నడుపన్ ♦ సైన్యంబునూల్కొంచు శ
త్రునికాయంబును ద్రుంచి దుర్గమును దో♦డ్తోఁ జొచ్చె నత్యుద్ధతిన్.

ఉ. వచ్చెను వచ్చె నేపుమెయి ♦ వైరిసమూహము మృత్యుదేవతం
దెచ్చెను తెచ్చె నేమి యిఁకఁ ♦ దిక్కు బలంబులు పోరి పోరి లోఁ

జచ్చెను చచ్చె నెవ్వ డిఁక ♦ జాలుదు రాజి కటంచు నార్పుచుఁ
గ్రిచ్చర వెన్క గొత్తిగిలె ♦ రాజనధాటి కరాతిసైన్యముల్. 209

మ. ఇటు చెన్నూరునృపాలుదుర్గము మహో ♦ ద్వృత్తిఁ విభేదించియు
త్కటశౌర్యంబున బిక్కనూర్బలము లు ♦ ద్వృత్తైరిరాడ్గోపుప
ర్యటదుత్తుంగని కేతనంబు తమరా ♦ జాధీనముం జేయ వి
స్ఫుటబాహాబలదర్ప మేర్పడఁ గ నా ♦ భూభర్త యత్యుద్ధతిఁ. 210

సీ. బంగారురంగులు ♦ పరవంజఘునశతాం
గములగంటలని స్వ ♦ నములతోడ
మావటీలుహసాదు ♦ మన్నించిపెల్లుబ్బ
కెరలుమత్తేభఘీం ♦ కృతులతోడ
సాహిణు లొత్మనసి కై ♦ జాచేయఁ దలలూచు
తతతురంగమహేషి ♦ తములతోడ
సంగ్రామరంగదు ♦ ర్జయు లైన మాస్టీల
పటుతరంబు లగు నా ♦ ర్భటులతోట

గీ. గడఁగి చెన్నూరుకోట ల ♦ గ్గలనుదాటి
తద్విభు సదమదింప య ♦ త్నంబు సలుప
హస్తముద్రిక కరవాల ♦ మతఁడు దెచ్చి
యెఱఁగి రాజేశ్వరున కిచ్చి ♦ యిట్టు లనియె. 211

మ. రమణీయోన్నతభర్మహర్మ్యములతో ♦ రాజిల్లు నీదుర్గముం
దమస్వాధీనము సేసి తిన్ననుఁ గృపా ♦ ర్ద్రం బైనచిత్తంబుతో
క్షమియింపం దగు సాపరాధుఁడను యు ♦ ష్మద్దాసుఁడ న్మీపదా
బ్జముల వ్రాలినవాఁడ దీనుఁడను రా ♦ జా? రాజరాజేశ్వరా?

మ. అని చెన్నూరువిభుండు నమ్రుఁ డయి దీ ♦ నాలాపము ల్సేయుచుం
దనసర్వస్వము నొప్పఁ జెప్పి శర ణ ♦ న్నన్ రాజరాజేశ్వరుం
డనుకంపాయతచిత్తుఁ డై యతని నె ♦ య్యంబొప్ప మన్నించి నే
ర్పున నాసయ్యెదుఖానుసాహెబువశం ♦ బుం జేసెఁ బ్రీతాత్ముఁ డై.

గీ. కనికరంబున సయ్యాదు ♦ ఖానుఁ డతనిఁ
బట్టి మహామదునగరవ ♦ ప్రిమున బంది
ఖానలో నుంచి యతనిదు ♦ ర్గంబుఁ జొచ్చి
వానిసిరి యెల్ల రాజన్న ♦ వశము సేసె. 214

శా. ఆరాజేశ్వరపార్థివుం డిటు మహీ ♦ యశ్శక్తి దుర్మార్గులం
గ్రూరారాతుల నుక్కడంచుచు మహిం ♦ గోల్కొండధాత్రీంద్రుస
త్కారంబు ల్గొను చంతకంతకును సం ♦ స్థానంపుఁబేర్వాసి వి
స్తారం బై చెలఁగం గ రాజ్యమునుదం ♦ చత్ప్రీతి నేలెన్ భువిన్.

గీ. తివిరి రాపాకలక్ష్మీప ♦ తిప్రణీత
ముఖ్యభరతాయురభ్యుద ♦ యాఖ్యకృతికి
నాథుఁ డై యురుకీర్తిస ♦ నాథుఁ డయ్యె
నవని నీరాజరాజేశ్వ ♦ రాఖ్యవిభుఁడు. 216

గీ. అతనియర్ధాంగలక్ష్మి రం ♦ గవ్వతల్లి
బీదలకుఁ గల్పవల్లి సా ♦ ధ్వీమతల్లి
హరిహరపదాబ్జచంచరీ ♦ యతిసుశీల
యమలగుణజాల సత్కారు ♦ ణాలవాల. 217

క. ఆరాజేశ్వరభూవరుఁ
డారంగమసాధ్వియందు ♦ నతిమోద మ్మిం

పారం గనె నేవురను గు
మారుల ననమానరూప ♦ మహితుల నెలమిన్. 218

సీ. వీరాగ్రిసరుఁ డైన ♦ పెద్దరాజేశ్వర
రాయం డవక్రప ♦ రాక్రముండు
శిష్టవర్తనుఁ డైన ♦ చిన్నరాజేశ్వర
రాయం డసమసూన ♦ సాయకుండు
శ్రితవత్సలుఁడు సదా ♦ శివరెడ్డి పండిత
బృందంబునకుఁ బెద్ద ♦ వేల్పుగిడ్డి
నయకోవిదుండు న ♦ న్నారెడ్డి యాశ్రిత
సమితికిఁ గల్పవృ ♦ క్షములదొడ్డి

గీ. యనఘమూర్తి సంగారెడ్డి ♦ జనవిభుండు
సుగుణగణఖని యనహాయ ♦ శూరుఁ డతని
నెన్నఁ దల మానె రాజరా ♦ జన్నపున్నె
మతనిపుత్త్రిలు లోకవి ♦ ఖ్యాతయశులు. 219

వ. ఈవడువున శ్రీరాజరాజేశ్వరకరుణావిశేషంబున నేవురఁబుత్త్రరత్నంబుల న్వడసి వారియందు సదాశివరెడ్డిధరావరుని మెదుకుసంస్థానాధీశ్వరునకును సంగారెడ్డినృపలలాముని పటంచెరువుసంస్థానపాలునకునుఁ దత్తులం గావించి యాదొరలవంశంబులు పావనంబులు సేసి తనరాజ్యంబును దక్కినపుత్త్రిలయధీనంబు సేసె. 220

శా. ఆపుణ్యాత్మునిపుత్త్రులం దిరువు ర ♦ ట్లన్యాచలాభర్త లై
రాపై మువ్వురిలోన నగ్రజుఁడు ధీ ♦ రాత్ముండు రాజేశ్వర
క్ష్మాపాలుండు నిజానుజు ల్గొలవ సం ♦ స్థానంబునన్ ధర్మముల్
దీపింపం బ్రజ నేలె శాశ్వతయశ ♦ స్థేమాభిరామాకృతిన్. 221

సీ. దక్కనుసేనలఁ ♦ దరిమి మరాటీల
సేనలు కయ్యంబు ♦ సేసినపుడు
భద్రాద్రి చెన్నూరు ♦ పాలవంచాది రా
జన్యు లల్లరి క్రిందు ♦ సలిపినపుడు
గోలకొండ హరాజీ ర ♦ గు మునిరుల్ముల్కు ద్రి
వ్యము లేక చిక్కులు ♦ పడ్డయపుడు
తనసేన లెల్ల జీ ♦ తముల కై పోరాడి
బిట్టుకష్టములను ♦ బెట్టినపుడు
గీ. వలసిన ధనంబు వలసిన ♦ బల మమతి యు
వలసినవి యెల్ల యొసఁగి తో ♦ డ్పడియెఁ దాను
రాజరాజేశ్వరుఁడు నిజాం ♦ రాజునకును
జేసినమహోపకారంబు ♦ సెప్పఁ దరమె. 222

సీ. భూలోకదేవేంద్ర ♦ మూర్తి దక్కనునవా
బంతటివాఁడు త ♦ న్నాదరింప
నైదంయుగీనక ♦ ల్క్యావతారుఁడు రాజ
చందులాలా తన్ను ♦ సత్కరింప
లోకత్రయీరాజమో ♦ త్సేకుఁ డై తగు మునీ
రుల్ముల్కు తనకు బి ♦ రుదము లొసఁగ
పాలవంచాదిభూ ♦ పాలలోకము తన
యాజ్ఞకు బద్ధు లై ♦ యడఁగి యుండ
గీ. నాత్మముద్రాంకితంబు లై ♦ నట్టిదాన
పట్టికలు భూమి నెల్లెడఁ ♦ బ్రబలుచుండ

మించె రాజేశ్వరవిభుండ ♦ మేయవిశ్వ
మండలాధీశుఁ డగుచు గో ♦ ల్కొండసీమ. 223

చ. ఒకయెడ ఫ్రెంచివారు మఱి ♦ యొక్కెడ హూణులుఁ జొచ్చి యిండియా
సకలము నావరించుచు ని ♦ జామునకుం బునహోధరాధిభ
ర్తకు మహిశూరురాజునకు ♦ దంపటికుంపటి వెట్ట నే మెఱుం
గక వడి వారు పోరిరి వ ♦ కాపక నవ్వుచు వీరు చూడఁ గన్. 224

ఉ. ఆకలహంబు నందు గొని ♦ హైదరబాదునఁ బాళెగాం డ్రిదే
మా కద నంచు లేచి పలు ♦ మాఱెదిరింప నవాబువారిఁ బో
నీక యడంచి రాఁదగిన ♦ యెక్కటివీరునిఁ బంపు మన్న ను
త్సేక మెలర్ప నాతని వ ♦ జీరు మునీరులుముల్కు నంతటన్. 225

మ. ఘనదోర్దండవిఖండితాఖిలరిపు ♦ క్ష్మాపాలలోకుండు స తీ
వ్రనిదాఘారుణదివ్యమూర్తి మన కా ♦ పద్బాంధవుం డెంతయు
న్ఘనరాజేశ్వరరాయభూరమణుఁ డ ♦ స్మన్మిత్ర మీకార్యము
న్ఘనకుం జేయు నటంచు నావిభున కీ ♦ మాట ల్వడి న్దెల్పినన్. 226

ఉ. ఆయతసేన గొల్వ నతఁ ♦ డామహదేవపురంబుచెంత సే
నాయుతులై యెదిర్చిన య ♦ నంతబలాఢ్యులఁ బాళెగాండ్ర న
ల్పాయులఁ జేసి వారిసిరి ♦ యంత నిజాము న కియ్య మెచ్చి వ
హ్వా యని నిండుకొల్వున న ♦ వాబతనిం గడుసత్కరించుచున్.

సీ. సూరతుముత్యాల ♦ సొబగొందు ఖిల్లాబు
నందుఁ జేసిన నిల్వు ♦ టంగి యొకటి
మగరాతురా నిగ ♦ నిగలసర్ఫేంచు ను
బరిభవిల్లెడు వెలి ♦ పాగ యొకటి

పచ్చలపిడితోఁడఁ ♦ గచ్చుమీఁజు హారంగు
తోఁ సాగ సగు చంద్రి ♦ హాస మొకటి
బిరుదులతోఁ దన ♦ పేరుచెక్కిన కెంపు
టా యొసంగెడు నంగు ♦ ళీయ మొకటి

గీ. యొసఁగి దయ దనివార న ♦ వ్వసుమతీశు
నవని మహాదేవపురమండ ♦ లాధిపతిఁ గఁ
జేసి తనముఖ్యసఖునిఁ గాఁ ♦ జేసికొనియె
నిట్లు రాజేశ్వరనృపాలుఁ ♦ డేపు మీఱి. 228

ఉ. మిక్కుటమైన నేస్తమున ♦ మీఱుమరావులతోఁడఁ బెంచి ధీ
ధిక్కృతదేవతీర్థుఁ డయి ♦ దివ్యవిభావసుభాతి వెల్గుచుం
జక్కనిత్రోవ రాజ్యమును ♦ సల్పె వజీరగు చందులాలత
న్నక్కజమైనసఖ్యమున ♦ నారసి మిక్కిలి గౌరవింపఁ గన్. 229

మ. తనకీర్తిద్యుతిజాల మెంతయు హరి ♦ త్ప్రాంతంబుల న్నిండ భూ
మిని రాజేశ్వరుఁ డేలి పుత్త్రికులు లే ♦ మిం జేసి గారాబుభ్రా
తృని నన్నాధిపు సింహసంహననమూ ♦ ర్తిం దివ్యశృంగారగా
త్రుని సింహాసనపట్టభద్రుని గఁ దో ♦ డ్తోఁ జేసె ధర్మాత్ముఁడై. 230

సీ. తల లెత్తనీక యు ♦ ద్ధంబులోఁ బగతుఱ
సైన్యంబుతోఁ బోరు ♦ సలుపునపుడు
స్మరకళానిపుణుఁడై ♦ చతురవేశ్యాంగనా
సమితితోఁ గ్రీడించు ♦ సమయమందుఁ
బ్రజ్ఞాతిశయ మేఱు ♦ పడఁ గ విద్వత్సింహ
ములతోడ గోష్ఠిలోఁ ♦ బొలుచువేళ

నతికృపాలోలుఁ డై ♦ యర్థిజనంబుల
కోర్కులత్యాసక్తిఁ ♦ గూర్చుతతిని

గీ. నరులు కిన్నరులు ను దేవ ♦ గురులుఁ కల్ప
తరువు లితనికిఁ దుల్యులే ♦ ధరణి నెంద
తేని యని తన్ను జను లెన్న ♦ నెన్నికఁ గని
పొలిచె విశ్వంబులో నన్న ♦ భూవిభుండు. 231

చ. అతని నిశాతహేతికి భ ♦ యంపడి పాఱిన వైరులుం ధరా
కృతిఁ గని హాళిఁ జెందని మ్మృ ♦ గేక్షణులుం దదనూనదాననం
గతిఁ గొనియాడి కైసరులు ♦ గట్టని సత్కవులుం దదీయపాం
డితిఁ గని యీసుమై దలలు ♦ డించని సూరులు లే రిలాస్థలిన్.232

మ. అలంఘుం డానరపాలుఁ డాత్మసుతు శ్రా ♦ ర్యప్రాభవ్యోపేతు ని
ర్మలచారిత్రు * నుమాపతీంద్రు నిజసా ♦ మ్రాజ్యంబునందుంచి ని
చ్చలు యుద్ధంబులు సేయుటందు ధనయో ♦ షానృత్యసంగీతలీ
లలయందున్ బహులోలచిత్తుఁ డయి కా♦లంబాదట న్బుచ్చుచున్.

మ. రమణీయోన్నతశృంగసంకలితవ ♦ ప్రం బొందు బాసావడగ్రా
మమునం గట్టి మనోహరంబు లగు హ ♦ ర్మవ్రాతముల్ప్రాఁకఁజే
సి మనోజ్ఞాయతవారియంత్రతతి భా ♦ సిల్ల న్మహోద్యానజా
లము వేయించి నిరంతరంబు సుఖలీ ♦ లన్బెన్నుమీఱ న్గడున్.234

గీ. వీరరసమందు మఱియు శృం ♦ గారరసము
నందుఁ గడు రుచి గలిగి య ♦ న్నాచలేంద్రుల
డాత్మసతి గుణవతి జాన ♦ కమ్మ తన్నుఁ
గొలువ నతివైభవంబుతోఁ ♦ బొలిచె మఱి యు. 235

* హిజరీ 1206 సం॥లో రాజా ఉమాపతిరావుగారు జన్మించిరి.

ఉ. దాడులు దీటుచుం దురక ♦ దాడులు దొడలు దీసి పైఁకి రా
నోడక పెక్కుసార్లు బహు ♦ యుద్ధము లుద్ధతిఁ జేసి వారిఁ జ
క్కాడెను మొక్కలీఁ డనఁ గ ♦ నన్ననృపాలుఁడె కాకయాదు రే
ప్రోడిమి రాజవంశమునఁ ♦ బుట్టిన మాత్రన నెల్లరాజులున్. 236

చ. అతనిసుతుండు మాపతి ధ ♦ రాధిపుఁ డూర్జితశక్తి లోకస
న్నుతమతిఁ దండ్రియానతి మ ♦ నోగతి నుంచి ప్రజ ల్సుఖంబు గాఁ
బ్రతుకు తెఱం గెఱింగి నయ ♦ భక్తియు యుక్తియు ధర్మమార్గసం
గతి యుఁ దొలంగ కేలెం ధరఁ♦గన్ననృపు ల్దనుఁజూచి మెచ్చఁగన్.

చ. అనయము మ్లేచ్ఛభాష గడు ♦ నార్థఁ బఠించి మసన్నవీషరీ
ఘను నతికష్టసాధ్య మయి ♦ నట్టి ప్రబంధములం బ్రగల్భుఁ డై
తనఘనపాండితిం గని స ♦ తంబు నుమహాల్విజనంబు విస్మయం
బును గొన విద్యఁ బూర్ణుఁ డయి♦పొల్చె నతండు కుశాగ్రబుద్ధియై.

చ. ప్రణుతగుణాళికి న్ననికి ♦ పట్టయి యొప్పు భవానియున్ సతీ
మణియగునట్టిలచ్చవస ♦ మాహ్వాయయుందనుఁగొల్వ సంతత
త్రిణయనపాదపద్మపర ♦ ధీయుతుఁ డై మతి దేవభూసురా
గ్రణులను భక్తిఁ గొల్చుచు జ♦గంబుననవ్విభుఁడొప్పెనొప్పుచున్.

మ. భగవంతు న్మదిఁ బాదుకొల్పి నియతిం ♦ బద్మాసనాసీనుఁ డై
భగవద్గీతలు చేతఁ బట్టుకొని యం ♦ భఃకేళి దేలుం దిరం
బు గఁ బద్మాకరమధ్యభాగమున నా ♦ భూభర్త తద్భక్తి కి
డగు నే నారదపుండరీకమునిము ♦ ఖ్యవ్రాతసద్భక్తి యున్. 240

సీ. అట్టిరాజేంద్రుని ♦ ల్లాండ్రిలోఁ బెద్దాకె
పరమపవిత్రి భ ♦ వానియమ్మ

రామేశ్వరాఖ్యుని ♦ రామచంద్రాఖ్యునిఁ
గొడుకుల నిర్వురఁ ♦ బడసెఁ బిదపఁ
బినభార్య లచ్చవ్వ ♦ గనె రాజరాజేశ్వ
రాఖ్యుని సోమేశ్వ ♦ రాభిధాను *
రాఘవేంద్రాహ్వయుఁ ♦ గ్రమమున మువ్వుర
సుతులను పీ రేవు ♦ రతులరీతి
గీ. నెసఁగు చుండంగ నాయిద్ద ♦ రిసతులకును
నగ్రిసుతు లైన రామేశ్వ ♦ రాహ్వయుండు
మఱియు రాజేశ్వరాఖ్యుండు ♦ నోరిమఁ గలసి
ధరణి నేలిరిరాజాంక ♦ బిరుదు లెనసి. 241

సీ. సర్వసర్వంసహా ♦ జలజాతనేత్రికుఁ
దమభుజాగ్రములు సా ♦ ధములు సేసి
కళలకు నెళ వైన ♦ కల్మికిఁ దమముఖ
కమలము ల్నాట్యరం ♦ గములు సేసి
అసదృశకీర్తిసా ♦ రస ముఖ కాత్మీయ
గుణసమూహము పట్టు ♦ కొమ్మఁ జేసి
త్రైలోక్యవినుతప ♦ ద్మాకుంభకుచ కాత్మ
భవనంబె యుద్యాన ♦ వనముఁ జేసి
గీ. ప్రభుత యును విద్య విఖ్యాతి ♦ భాగ్యగరిమ
వెలయు రామేశ్వరాఖ్య పృ ♦ ధ్వీవరుండు
రాజరాజేశ్వరాఖ్యధ ♦ రావరుఁడు నుఁ
బొలిచి రందు రామేశ్వర ♦ భూధవుండు. 242

---

సోమేశ్వరరావు బహద్దర్ వారిజననం హిజరీ 1244 సం॥

మ. తనమేధావిభవంబు పొల్పెసఁగ నాం ♦ ధ్రింబందున మ్లేచ్ఛభా
ష నసామ్యం బగు పాండితిం గని మనీ ♦ షావంతు లాత్మీయవి
ద్యను శ్లాఘింపఁ గ గద్యపద్యయుతకా ♦ వ్యవ్రాతము ల్పారసీభా
షను గావించె న వెల్ల నిప్పుడు ను వి ♦ స్తారంబు లై యొప్పెడుఁ.

మ. తనబాహాబలదర్ప మేర్పడఁ గఁ బ్రా ♦ తర్వేళ వ్యాయామఖే
లనలోలాత్మకుఁ డై యతండు నవలీ ♦ లం ద్రిప్పు ముద్రాదిసా
ధనజాలంబు బలాఢ్యపూరుషకర ♦ ద్వంద్వంబుచే నైన నె
త్త నసాధ్యం బయి యొప్పుచుండుఖురళీ♦ధామంబునందిప్పుడుఁ.

గీ. ఇట్లు రామేశ్వరక్షమా ♦ ధీశమౌళి
రాజరాజేశ్వరుండు ను ♦ రాజ్య మేలి
యచిరకాలంబులోన స్వ ♦ ర్గాధిపత్య
మునకుఁ బట్టాభిషిక్తులై ♦ చనిరి చనిన. 245

గీ. తత్సపత్నీకుమారసో ♦ దరులు రామ
చంద్రసోమేశ్వరాఖ్య ర ♦ సాతలాధి
పతులు రాజ్యంబు పాలించి ♦ రతులకీర్తి
పొందు లయి యందు శ్రీరామ ♦ చంద్రవిభుఁడు. 246

సీ. తల్లిదండ్రులమాట ♦ దాఁటనొల్లక పెద్ద
యడవుల నిడుమలు ♦ వడినవార్త
సవతితమ్ముల నాత్మ ♦ సహజన్ములగతి మే
లరసి ప్రేమించిన ♦ యట్టివార్త
శరణన్న శత్రుప ♦ క్షమువారి నైనను
నాదరించి భరించి ♦ నట్టివార్త

లోకాపవాద మా ♦ లోచించి కూర్మిభా
ర్యనుం గూడఁ దొలఁగించి ♦ నట్టివార్త

గీ. విన్నవా రెల్ల సీతఁడా ♦ యినకులుం డొ
యంచు భ్రమఁ జెందునట్లు వ ♦ ర్తించెఁ బుడమి
నకలుషం బైన మార్గంబు ♦ నధిగమించి
రామచంద్రావనీశుండు ♦ రమ్యయశుఁడు. 247

ఉ. బాహుబలంబు శౌర్యముఁ గృ ♦ పారసము న్వినయంబునీతియుఁ
సాహసముం బ్రియోక్తులు ను ♦ శాస్త్రవివేకము మిత్రబాంధవ
స్నేహము విద్య యు న్విబుధ ♦ సేవయు దేవధరామరేంద్ర సం
దోహగురుప్రపత్తి యుఁ గ ♦ నుంగొన నాతని కొప్పు సాజముల్.

* చ. విమలగుణుం డతండు పృథి ♦ వీస్థలి ముప్పదిరెండువర్షము
ల్సముచితరీతి నేలి సక ♦ ళత్రము గా బహుయాత్ర లింతకా
లమున నె చేసి యంతట మ ♦ లంగ కొకానొకనాఁడు వృద్ధగా
తమి మునుగం గ బంధుసహి ♦ తంబు గఁబైనము సేసి పోవుచోఁ.

క. సేవింపఁ గఁ దలఁచిన గో
దావరి యిఁక మూఁడుమైళ్ళ ♦ దారి యనం గాఁ
బ్రోవను బరమపదముఁ గనె
నావిభుఁ డటు వల్లకొండ ♦ యను గ్రామమునఁ. 250

ఉ. విశ్వసనీయధర్మగుణ ♦ విశ్రుతు లాతనితమ్ము లైన సో
మేశ్వరరాఘవేంద్రజగ ♦ దీశ్వరు లాతని కుత్తరక్రియల్
శశ్వదనూనశాస్త్రవిధి ♦ సల్పి స్వకీయపురంబుఁ జేరుచు
న్విశ్వభరంబుఁ దాల్చి తమ♦పేరిట సన్నదు లంది రంతటఁ. 251

* హిజరీ 1259 సంవత్సరములో నీవృద్ధ గోదావరీ యాత్ర జరిగెను.

చ. వయసునఁ బిన్న లయ్యును న ♦ పారవివేకము గల్గి ధర్మసం
చయము దొలంగకుండఁ గడు♦చాతురిరాజ్యమునిర్వహించుచున్
భయము ను భక్తిం దోపఁగ న♦వాబునుఁ గొల్చి సతంబువాని స
ద్దయ గడియించి రాజబిరు ♦ దంబుల నందిరి వారలిద్దఱున్. 252

ఉ. అందున సోమభూధవుఁడ ♦ హర్పతి తేజుఁడరబ్బిరోహిలా
లెందునఁ జూచినం బ్రజల ♦ నేఁచుచుఁ దద్దన మెల్ల దోచు చు
న్నం దగఁ జూచి యిప్పనియనారతమున్ జరుగంగ నూర కె
ట్లుందు నటంచు వారిపయి ♦ నుద్ధతిఁ జేసెను క్రందుకయ్యమున్.

వ. ఇట్లు సోమేశ్వరవిశ్వంభరేశ్వరుండు ప్రీతి లేని పరాక్రమంబునఁ
జెలరేఁగి చోరులు ను దురాచారులు నుఁ బ్రజాహింసకులు ను
నతిక్రూరులు ను రాజద్రోహులు ను రాక్షసకర్ములు ను నగు న
రబ్బీరోహిలాలపయిఁ దాఁడి వెడలి పెక్కుచోట్ల సందడికయ్యంబు
సలిపి వారియుక్కుఁ బో నడఁచి తనరాజ్యంబునందలి జీండ్రింబుం
బుచ్చి వైచె. మఱి యును నుజ్జయినీకొడుపుగల్లుజహగీరుదారులు
నిజాముపైఁదిరుగుపాటు చేసినపుడు నిజామునియానతిం గొని తమ్ము
నితోఁ దత్సేనం గలసి యామన్నదొరలం బోరి వారిబలంబులు
నేలఁ గలపి యాత్మప్రభునకు జయం బాపాదించి తనధైర్యసాహ
సంబులను ధరణిం బ్రకటించె నంత. 254

సీ. వచ్చె వచ్చెను సోమ ♦ వసుధావరుం డింకఁ
గోటమా ఁటే మని ♦ కుందుగువారు
కోట దాటెను పాక ♦ నాటిమన్నీ డింక
బలము లె ట్లని భయం ♦ పడెడివారు

బలములఁ జీకాకు ♦ పఱచె లచ్చవబిడ్డఁ
డెళ్ళ కె ట్లని తల్ల ♦ డిల్లువారు
నిళ్ళ కగ్గి రగిల్చె ♦ నిదె రాజవమగండు
బ్రతుకు టె ట్లని కాళ్ళఁ♦బడెడువారు

గీ. నయి యరబ్బీలు ఘోషింపా ♦ లడలి తనకుఁ
జెప్పక య ప్రాణములునర్థ ♦ మప్పగింప
దుష్టుల నడంచి రాజ్యమం ♦ దునఁ బ్రజలకు
సేమ మొడఁ గూర్చి యాత్రలు ♦ సేయఁ దలఁచి 255

సీ. శౌర్యంబునను సాహ ♦ సమున వివేకంబు
నందు వితరణంబు ♦ నందు మంచి
చదురున మైత్రి సదా ♦ చారంబునను దేవ
భూసురార్చనముల ♦ భూతదయను
రాచకార్యమునందుఁ ♦ బ్రాభవంబున భోగ
భాగ్యంబులందు స ♦ ర్వంబునందుఁ
దనకు సమానుఁ డై ♦ తాఁ జేయుకార్యంబు
లం దెల్లఁ దనకు స ♦ హాయపడిన

గీ. కూర్మితమ్ముని సకలస ♦ ద్గుణగరిష్ఠు
రాజ్యమం దుంచి తనయభి ♦ ప్రాయములను
దెలిపి తా నేగఁ దలఁచిన ♦ దివ్యయాత్ర
సేవను గురించి సర్వంబుఁ ♦ జెప్ప నతఁడు. 256

ఉ. ఇంచుక చింత సేసి యిఁక ♦ నే మన లేక పు డన్నఁ జూచి మీ
రెంచినపుణ్యకార్యమున ♦ కే ప్రతిబంధము సెప్ప నెట్లు మా

మంచిది యాత్ర లెల్లనుఁ గ ♦ మంబు గ సల్పి బిరాన మీరు రం
డంచుఁ బ్రణామము ల్సలిపి ♦ యన్ననుఁ దల్లినిఁబంపి యంతటన్.

చ. భరతుఁడు మున్ను రాము నెడఁ ♦ బాసి యయోధ్యనునేలినట్టు స
చ్చరిత్రుఁడు రాఘవేంద్రవసు ♦ ధావరుఁ డేలెను దోమకొండ ము
ష్కరపరిపంథులు జ్జయిని ♦ కంగిన నాతనిపిక్క నాటి యు
క్కరిన తుపాకిగుండుకత ♦ నాత్మఁదలంచిమలంగుచుండఁగన్. 258

గీ. అతనిజాయ యనంతవ్వ ♦ యతిసుశీల
యామె నోమని నోములు ♦ నామె సేయ
నట్టిపున్నెంబులు ను నామె ♦ యాచరింప
నట్టి ధర్మములును ధర ♦ యందు లేవు. 259

ఉ. పమ్మినవేడ్క నిట్లునిరు ♦ పద్రవమై తనరారు రాజ్యముం
దమ్మునియందు నుంచి తన ♦ తల్లినిఁ బుణ్యసతీమతల్లిఁ బ్రే
మమ్మున వెంటఁ బెట్టుకొని ♦ ధర్మవరుం డుత్తరమందు నున్న క్షే
త్రమ్ములు గొల్చి కాశిఁజను ♦ దారిని సోమవిభుండు పట్టుచున్.

ఉ. పోవుచు నుండ నొక్కెడ జ ♦ బల్పురిచెంగట రామకుంకి నాఁ
గావెలు గొందు గ్రామమునఁ ♦ గాలము చేసెను దల్లి సోమగో
త్రావరుఁ డుత్తరక్రియ య ♦ థావిధి నామె కొనర్చి యస్థులం
బ్రోవొనరించి మోసికొని♦పోయి సురాపగఁ జేర్చెఁగాసిలోన్. *

ఉ. ఇంపుగ నన్నపక్షిఁ దని ♦ యింపని యర్థిజనంబు భక్తి సే
వింపని దేవకోటి నడ ♦ పింపనిధర్మచయంబు నర్థిఁ జే
యింపనిపుణ్యకార్య మెన ♦ యింపని సద్వ్రతపుంజ మామె గా
వింపని యాత్ర లెందుఁ గని ♦ పింపవు లచ్చవపున్నె మన్నె మే.

* 1280 హిజరీ సంవత్సరమున కాశీయాత్ర జరిపెను.

సీ. లేవ నోల్లదు గదా ♦ లీలామయుని దేవ
దేవుని నాత్మఁజిం ♦ తించి కాని
నడువ నోల్లదు గదా ♦ నారాయణ్ణుని నామ
ముడివోని భక్తితో ♦ నుడివి కాని
కుడువ నోల్లదు గదా ♦ పుడమివేల్పుల కన్న
సంతర్పణంబులు ♦ సలిపి కాని
పండ నోల్లదు గదా ♦ పరమాత్మసత్కథ
ల్నెవులార విని తృప్తిఁ ♦ జెంది కాని
గీ. పరమసతి యన్న సుగుణసం ♦ పన్న యన్న
ధర్మవతి నా సదాచార ♦ ధన్య యన్న
ధరణి సోమేశ్వరనృపాలు ♦ తల్లి యయిన
లచ్చవ యె కాక యగుదు రే ♦ లాతి సతులు. 263

గీ. అట్టి తల్లిని నిట్లు కృ ♦ తార్థురాలిఁ
జేసి సోమేశ్వరవిభుండు ♦ కాశిఁ బాసి
నిజపురంబునుఁ జేరి యా ♦ త్మజను లెల్ల
నింపుతోఁ గొల్వ రాజ్యంబు ♦ నేలు చుండె. 264

ఉ. సారగుణుండు సోమనృప ♦ సత్తముఁ డి ట్లలర న్నిజాముస
ర్కా రపు డాధరావరుని ♦ గ్రామము లెవ్వియొ చేర్చుకొన్నఁడా
నారసి యుక్త మైన వ్యవ ♦ హారములం జరిగింప శ్రీలఁ జె
న్నా రెడు రాజధాని యగు ♦ హైదరబాదునుఁజేరి యచ్చటన్. 265

శా. ప్రాంచత్పుష్పలతాగృహంబులు విహా ♦ రారామము ల్వారియం
త్రాంచద్వారిసరంబులున్ రుచిరసూ ♦ నాగారనిర్యన్మరు

త్సంచారార్ష్మపథంబులు న్వేలయఁ బ్రా ♦ సాదంబులం గట్టి తా
నంచల్లీల వసించి చూడఁగలకా ♦ ర్యంబు ల్విచారించుచున్. 266

శా. సాలార్జం గను మంత్రిసత్తమునితో ♦ సఖ్యంబు గావించి వా
చాలాలిత్య మెలర్ప నాయనకు సంస్థానంపుమర్యాదలం
బోలం జెప్పిన నాతఁ డారసి యథా ♦ పూర్వంబు గా నిచ్చె ని
ష్టాలాపంబులఁ దేలు చావిభునికి ♦ న్న్యాయంపు గ్రామంబులన్.

సీ. తురగలక్షణముల ♦ నరసి చూచెడు వేళ
సింధురంబుల విమ ♦ ర్శించు వేళ
నమరరత్నముల నా ♦ డెములు కట్టెడు వేళఁ
దేరులతీరు గు ♦ ర్తించు వేళ
ఖడ్గసాధనములు ♦ కనుగొనియెడువేళ
శిల్పిశాస్త్రము పరీ ♦ క్షించు వేళఁ
దనరాజ్యమును గనుం ♦ గొనఁ గఁబోయెడు వేళఁ
దివిరి వేఁటఁ జన య ♦ త్నించు వేళ

గీ. నన్నిట నతిప్రగల్భుఁ డై ♦ యతిశయిల్లు
సఖుఁడు సోమేశ్వరవిభుండు ♦ సరస లేక
మంత్రి సాలారుజంగు స ♦ మ్మతి నెవి యును
జేయఁ డెన్నం డనిన విశ్వ ♦ సింప వలయు. 268

సీ. నైజాము తానసఫ ♦ నగరంబుఁ బోవుచో
స్వారితో నుండ నే ♦ ర్పఱచినాఁడు
* బొంబాయిలో నార్తు ♦ బ్రూకు చేసినసభ
వెస నగ్రపీఠ మి ♦ ప్పించినాఁడు

* హిజరీ 1289 సంవత్సరములో నీసభ జరిగెను.

హైదరబాదురా ♦ జ్యపు రైలు కంపిని
కార్యదర్శి గఁ జేయఁ ♦ గలిగినాఁడు
రక్షితసంస్థాన ♦ రాజన్యులం దెల్లఁ
బెద్ద గాఁ దను గౌర ♦ వించినాఁడు
గీ. మంత్రి సాలారుజంగు సో ♦ మక్షితీశ
వాళి కొనరింపనట్టిది ♦ మహినిఁ గల దె
మైత్రియన్నను నదియెస ♦ న్మైత్రిగాక
మాటలకుఁ జేయుమైత్రి యు ♦ మైత్రి యగు నె. 269

† చ. ప్రితతరిపుక్షమేశసమ ♦ వర్తికి నిండియచక్రవర్తికిం
బ్రతినిధి గారిపప్రభువు ♦ వచ్చుతఱిం గలకత్త కేగి యం
దతనికి స్వాగతం బొసఁగ ♦ నంపిన మేల్సరదారులందు నీ
క్షితిపతి యొక్కఁ డై బహుళ ♦ కీర్తికి నెక్కె నిజాము చెంగటన్.

‡ క. హరిహర దేవాలయములు
నరు దగు సౌధములు సురుచి ♦ రారామంబు
ల్విరచించి దోమకొండకు
గరిమంబుం దెచ్చె శిల్ప ♦ కళ చెలువారన్. 271

ఉ. వారిధిలోతుఁ గన్గొని స ♦ భంబునుఁ జుట్టునుఁ గొల్చి తార ల
వ్వారి గ లెక్క పెట్టి పిద ♦ పంబ్రజ లెంచఁ గ వచ్చు బువ్వ కే
కారుచు క్షామమందుఁ దన ♦ యండను జేర భరించి సోమధా
త్రీరమణుండు సాదమిడి ♦ పెంచినబీదలసంఖ్య మొత్తమున్. 272

---

† హిజరీ 1302 సంవత్సరములో రిపన్ గారి సందర్శనము.

‡ హిజరి 1293 సంవత్సరములో రాజాసోమేశ్వర రావుగారి దేవాలయములునిర్మించిరి.

* సీ. రాహుతుమహలు పే ♦ ర నెసంగు సాధాంత
రమున నైజాముద ♦ ర్శనము సేసె
¶ గ్రామంబులో బీద ♦ సాదల రక్షించి
పడసె మహాబల ♦ వంతబిరుదు
రెసిడెంటుప్లౌడ న ♦ ర్మలి గారవింపం గ
నతనితోం బెంచెన్న ♦ హంబు మఱియు
$ మొనసి తులాభార ♦ మును దూంగి ధన మెల్ల
బ్రాహ్మణపజ్క్తికిం ♦ బంచిపెట్టె
గీ. నేకవారాన్నభోజనం ♦ బెనసె హరిహ
రోత్సవంబులు మిగులం బెం పొందం జేసె
సదమలాచారగరిమంబు ♦ సంతరించె
దోమకొండపురీశుండు ♦ సోమవిభుండు. 273

సీ. వేనవేల్ కాప్యముల్ ♦ వెచ్చించి కొనితెచ్చె
సీమసీమలనుండి ♦ సింధురములు
వరహాలపోగులు ♦ పఱచి తెప్పించె ది
గ్దేశంబులందుండి ♦ తేజులగమి
కోటానకోట్లు పో ♦ గులు వోసి విలిచె దీ
పములం బోలెడురత్న ♦ పటలములను
గణనకు మీఱురో ♦ క్క మొసంగి రప్పించె
దినుసుదినుసు పేర్ల ♦ తేర్లబారు

---

* హిజరీ 1306 సంవత్సరములో సీమర్యాద జరిగెను.

¶ హిజరీ 1311 సంవత్సరములో మహాబలవంత బిరుద మియ్యబడెను.

$ హిజరీ 1311 సంవత్సరములో జరిగినది.

గీ. స్వర్ణ మెత్తున కెత్తు గాఁ ♦ బారవైచి
కొనియె సురభులఁ బోలెడు ♦ గోగణంబు
కుంచములతోడ మొహరీల ♦ ఁగొలిచి విలిచెఁ
జీనిచీనాంబరంబులు ♦ చిత్రములుగ. 274

సీ. తనకంటె నెక్కుడు ♦ ధనమున్నవారునుఁ
దనకంటె గొప్పసం ♦ స్థానపతులు
తనకంటె మేటిప ♦ దముల నుండెడివారు
తనకంటె విద్యఁ బె ♦ ద్దలగువారుఁ
దనకంటె సాహస ♦ ధైర్యముల్ గలవారు
తనకంటెఁజాతుర్య ♦ మెనయువారు
దనకంటె నెక్కుడు ♦ దాతలైతగువారు
తనకంటెఁ బూజ్యులై ♦ తనరువారు

గీ. తనకు మర్యాద లొసఁగుచుఁ ♦ దనసమీప
వర్తులై తనసుగుణసం ♦ పదల నెపుడు
కీర్తి సేయంగ గాంభీర్య ♦ మూర్తి యగుచు
వరలు సోమేశ్వరావనీ ♦ వల్లభుండు 275

సీ. బర్పీ పేడా జిలా ♦ బాలు నా దగు ఁపిండి
వంటలు లెన్నగా ♦ వండఁ జేసి
ప ప్పారుబిండ్లు ద ♦ ప్పళము లప్పళములు
గొజ్జులు బజ్జులు ♦ గూర లమర
నూకలు దేరి క ♦ న్నులకు నింపగు కమ్మ
నేయి చేరలకొలం ♦ దిని యొసంగ

మృష్టాన్న మిడు భక్తి ♦ మేకొన సద్విజో
త్తములకుఁ బక్షప ♦ క్షమును విడక

గీ. హరపదాంభోజచింతనా ♦ పరుఁడు విమల
కీర్తియుతుఁడు సదాచార ♦ మూర్తి కలుష
దూరుఁ డఖిలాశ్రితజనమం ♦ దారసముఁడు
దోమకొండపురీశుండు ♦ సోమవిభుఁడు. 276

సీ. సేతువు మొదలు కా ♦ శిక దాఁక నున్నట్టి
సకలపుణ్యక్షేత్ర ♦ సముదయంబు
సకుటుంబముగఁ బెక్కు ♦ సార్లు సేవించెను
కొడుకులఁ గొడుకుల ♦ కొడుకుల మఱి
కొడుకులమనమలఁ ♦ గూడఁ బ్రేమించెడు
భాగ్యంబు వడసె న ♦ వాబు తన్ను
మన్నింపఁ గా దొడ్డ ♦ మన్నెహజారుల
తోడసఖ్యముఁ బెంచెఁ ♦ దుచ్ఛులయిన

గీ. వారి నెల్లర భర్జించి ♦ దూరముంచె
సదమలం బైన విఖ్యాతి ♦ సంతరించెఁ
గామినేన్యన్వవాయరా ♦ కావిధుండు
దోమకొండపురీశుండు ♦ సోమవిభుఁడు. 277

సీ. తనయొద్ద నున్నత ♦ త్తడులతండంబును
దనయొద్ద నున్నదం ♦ తావళములు
తనయొద్ద నున్నర ♦ త్నములసంపద యునుఁ
దనయొద్ద నున్నర ♦ థముల గములు

తనయొద్ద నున్నవ ♦ స్త్రీమ్ములపజ్జ్కులు
తనయొద్ద నున్నచి ♦ త్తరులగుంపు
తనయొద్ద నున్నయ ♦ స్త్రీపత్రికరంబు ను
దనయొద్ద నుండుగో ♦ ధనము నెల్ల
గీ. దేశదేశంబు లెల్లనుఁ ♦ దిరిగి తిరిగి
కోరినధనంబుతో వెలఁ ♦ గొన్న వపుటి
రాజరాజాధిరాజదు ♦ ర్లభ్య భూతి
విశ్వమున నొప్పె సోమధా ♦ తీశ్వరుండు. 278
సీ. తనసాధపజ్జ్కులు ♦ గనుగొన్న వారికి
నింగ్లాండులో లండ ♦ నేమి లెక్క
తనవిహారారామ ♦ తతిఁ గన్న వారికిఁ
బ్రాంసులోఁ బారి సే ♦ పాటివింత
తనతపోమందిరం ♦ బును గన్న వారికి
టిబెటులోలాస దే ♦ టిగడుగొప్ప
తనశస్త్రశాలలు ♦ గనుఁగొన్న వారికి
జెరుమనిలోస్పెషీ ♦ ల్డురు ద దెంత
గీ. అనుచు గర్వించుటకుఁ దగి ♦ నట్టిమంచి
నాగరికతలచేత వి ♦ న్నాణ మయిన
వస్తువులచేత నొప్పునై ♦ శ్వర్యములను
* వరలు సోమేశ్వరావనీ ♦ వల్లభుండు. 279
ఉ. అమ్మహిపాలుధర్మసతి ♦ నై నుతిఁ గాంచెను రాజవాంబ యా
యమ్మ పతివ్రతాత్వమున ♦ కామెసుశీలత కామెధర్మకా

* హిజరీ 1316 సంవత్సరములో పరమపద మొందిరి.

ర్యమ్ముల కామెసద్గుణప ♦ రంపర కాయమపుత్త్రిపౌత్త్రిభా
గ్యమ్మున కామెసంపదకుఁ♦గానఁ గ రాదు సదృశు మెందునుఁ. 280

సీ. అఖిలసజ్జనులకా ♦ మ్యార్థఁబు లరయంగఁ
గదలనేర్చినకల్ప ♦ కంబనంగ
బీదసాదులకోర్కు ♦ లాదట నెఱుఁగ మా
టాడ నేర్చిన వేల్పు ♦ టావనంగఁ
దనక ల్మి బుధులకు ♦ వినియోగ మొనరింప
నెఱఁగి వచ్చిన మేరు ♦ గిరి యనంగ
నామమాత్రమున నుం ♦ డఁగ నోప కొకరూపు
దాల్చి పొల్చెడుమహా ♦ దార్య మనఁగ

గీ. నప్రతిమధారుణీసురా ♦ న్నప్రదాన
జాతకాతూహలాంచిత ♦ సదయహృదయ
సద్గుణకదంబ ముఖజిత ♦ చంద్రబింబ
వెలయు రాజవ్వతల్లి సా ♦ ధ్వీమతల్లి. 281

సీ. అనుకూలుఁడై ప్రాణ ♦ మట్టులు తన్నుఁ బ్రే
మించు ప్రాణేశుసే ♦ వించుభాగ్య
మమలగుణాన్వితు ♦ లై యెసంగెడు పుత్త్ర
పౌత్త్రప్రపౌత్త్రులఁ ♦ బడయుభాగ్య
మాశ్రితదారిద్ర్య ♦ హరము గాఁ దదభీష్ట
జాలంబుఁ దీర్పఁ గాఁ ♦ జాలుభాగ్య
మతిగుణవతి యు మ ♦ హాపతివ్రత యంచుఁ
జెలఁగు విఖ్యాతియా ♦ ర్జించుభాగ్య

గీ. మనుఁగుఁగొడుకులు మనుమలు ♦ మనుమరాండ్రు
కూఁతులును మఱి కోడండ్రు ♦ గొలువ జీవి
తేశ్వరునిమ్రోల బ్రహ్మైక్య ♦ మెనయు భాగ్య
మెవరికిలభించు నొక్కరా ♦ జవకుఁ గాక. 282

సీ. పాలమున్నీటిలోఁ ♦ పల సుధాంశునిలీలఁ
బూవులోఁ గమ్మని ♦ తావిపగిది
శుక్తికోటరమున ♦ ముక్తాఫలమురీతిఁ
బెరుగున గరగర ♦ వెన్నమాడ్కి
నిక్షుదండంబున ♦ నింపైనరుచిపోలె
సప్తాశ్వులోనఁ దే ♦ జంబుఠేవఁ
జంచలాలతయందు ♦ శక్తిచందంబునఁ
బరమాత్మునెమ్మదిఁ ♦ గరుణకరణి.

గీ. ధరణి సోమేశ్వరనృపాల ♦ ధర్మపత్ని
రాజవసతీమతల్లిగ ♦ భవ్యమునఁ బొడమె
నీకృతీశుండు సుశ్లోకుఁ ♦ డిద్ధగుణుఁడు
రమ్యశీలి యుమాపతి ♦ రాజమౌళి. 283

ఆశ్వాసాంతపద్యములు.

శా. ప్రాలేయాచలకన్యకాధవపదా ♦ బ్జాతాసవోత్పర్యట
ద్రోలంబాయితదృక్ప్రసారరుచిర ♦ భూప్రిన్యస్తహస్తప్రణా
మాలంకారయుతానతాననసము ♦ ద్యద్భూసురాశీర్వచో
జాలశ్రీసముపాత్తపూజ్యతమరా ♦ జ్యప్రోజ్జ్వలద్దోర్బలా. 284

చండకరకిరణఘృణిమణి
కుండలమండితకపోల ♦ కుజనవిఫాలా
దండితరిపుభూపాలా
యండజవాహనపదాంబు ♦ జార్చనలోలా. 285

మాలిని. నిరుపమగుణధామా ♦ నిర్మలానందసీమా
పరమకులపవిత్రా ♦ పండితస్తోత్రపాత్రా
తురగగమనదక్షా ♦ తుండితారాతిపక్షా
సురుచిరతమగాత్రా ♦ సోమభూపాలపుత్రా. 286

గద్య.

ఇది శ్రీసర్వమంగళానాథ కరుణాసనాథ రామలక్ష్మాంబా
బుచ్చి వేంకయమంత్రీంద్రపుత్త్ర ఆదిపూడికులపవిత్ర
బుధవిధేయ ప్రభాకరనామధేయప్రణీతం
బయిన యుమాపత్యభ్యుదయమను
కామినేనివంశచరిత్రంబు స
ర్వంబు నేకాశ్వాసము
సమాప్తము.
శ్రీ.

